

అంతర్జాతీయ తెలుగు సాంస్కృతిక మాస పత్రిక

సంపాదకవర్గం:

సంపాదకుడు:

లయన్ కె.వి.గోవిందరావు బి.ఏ.,ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్సి.,

వి.బాలకుమార్ ఎమ్.ఏ.,బి.ఎల్.,

సభ్యులు:

కె.వి.ఎస్.శరత్ బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎడ్.,

కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,

కె.రత్నకుమారి.

## చందా వివరాలు

| | |
|---|---|
| 3 సంవత్సరాల చందా | రూ. 100/- |
| సంవత్సర చందా | రూ. 36/- |
| ఎయిర్ మెయిల్ (1 సం॥) | రూ. 130/- |
| సీ మెయిల్ (1 సం॥) | రూ. 75/- |

చందా పంపవలసిన చిరునామా

రత్నా ఏజెన్సీస్

9, దేశికా రోడ్, మైలాపూర్, మద్రాస్-600004

ఫోన్: 73327

# ఈ సంచికలో

## మే 1991



ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
జగ్‌మోహన్

## ధ్యాన

# శక్తికి మూలం



జేమ్స్ ఎలెన్

జగత్తు అంతా అణువణువునా వ్యాపించుకు పోయింది దివ్యశక్తి. ఈ శక్తిని ఏకించిత్తైనా తెలుసుకోడానికి ప్రయత్నించాలి. అప్పుడే మానసికస్థితి స్థిరపడుతుంది. బ్రహ్మాండ భాండాన్ని శక్తి భావంతో అన్వయించుకో. అప్పుడు విశ్వమంతా ఒక ఆజ్ఞానుసారంగా కొనసాగుతూందని అవగతం అవుతుంది. న్యాయం, ధర్మం, సామరస్యం, వలపు, ప్రేమ, అనురాగం అనేవి విశ్వంలో వివిధ విశిష్టరూపాలలో వ్యక్తమవుతూంటాయి. విశ్వశక్తిని లేదనుకొన్నప్పుడు ప్రతికూల పరిస్థితులు ప్రవృద్ధి పొంది నిత్య జీవితం యాతనామయం అనిపిస్తుంది. విశ్వధర్మాన్ని వివరంగా అవగాహన చేసుకున్నప్పుడు సిసలైన శక్తి సామర్థ్యాలు తెలుస్తాయి. వ్యక్తిగతమైన విజ్ఞానశక్తిని విశ్వశక్తితో ఏకం చేసుకుని పరిపూర్ణమైన శక్తిని ప్రతిష్ఠించు

(మిగతా 3 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

# సంభాషణా చాతుర్యం

నిర్బంధం లేని కార్యసాధకమైన స్వేచ్ఛా సంభాషణా విధానమే పతిష్టవంతమైన ప్రజాస్వామిక ప్రజాధోరణి. ఇదే మనస్సుకి ఉత్తేజం కలిగించి భావనాశక్తిని ఉత్సాహ పరుస్తుంది. వివేకవంతమైన సంభాషణా ప్రసన్నత సమాజంలో నాగరికుల విశిష్ట లక్షణం. స్వేచ్ఛగా సంభాషించ లేనివారు మానసికంగా దుర్బలులు. విస్తృత గ్రంథ పఠనంకన్నా సరస సంభాషణా చాతుర్యం వల్ల మానవుని మనస్సు అతి శీఘ్రంగా ప్రగతికరమైన ప్రవృద్ధి పొందుతుంది.

మంచి మాటకారిగా రాణించాలంటే అందరూ అభిమానించే సమకాలీన సామాన్య విషయాలను పూర్తిగా తెలుసుకుని ఉండాలి. ముఖ్య విషయాలను సంగ్రహించి వీలైనప్పుడు సంభాషణలో యథోచితంగా సందర్భానుసారంగా ఉపయోగిస్తూండాలి.

సంభాషణా చాతుర్యం అనేది నలుగురూ అనుభవించి ఆనందించగల వీనుల విందు. సంభాషణలో లౌకికమైన సామాన్య విషయాలనే ఉపయోగించాలనేది మరచిపోవద్దు. సంభాషణలో వీలైనంతవరకూ 'స్వార్థాని'కి ఎంత మాత్రం తావీయకుండా జాగ్రత్తపడు. నలుగురూ చేరినప్పుడు అందరికీ అర్థమయేటట్టుగా విషయాన్ని విశదీకరిస్తే అభిమానంతో ఆసక్తిగా వింటారు. మాట్లాడేటప్పుడు సంతోషం, ఆశ్చర్యం కలిగించే క్రొత్త క్రొత్త విషయాలను గురించి మాటిమాటికి ధోరణి మారుస్తూంటే సంభాషణ రక్తికడుతుంది.

శాశ్వతమైన ఆనందానుభూతికి, సమాజంలో

"నిత్యనూతనాన్ని అనుభవించడమే రమణీయత."

వలుకుబడికి సంభాషణ మూలం. కుశాగ్రబుద్ధితో మనస్సును ఎప్పటికప్పుడు కాలానుగుణ్యంగా



ఉంచుకుంటే నీ సంభాషణ విన్నవారందరికీ సంతోషం కలుగుతుంది. స్వేచ్ఛతో, సహజంగా మాట్లాడుతున్నావని అనిపించుకో.

## కొయ్యనుండి చక్కెర

*1926 లో జర్మనులు కొయ్య నుండి చక్కెరను ఉత్పాదించే అపూర్వ విధానాన్ని అభివృద్ధి చేసారు. కొయ్యలో ఉండే పీచు లేక సెల్యూలోజ్ రసాయనిక రచనా విధానం, పిండి (Starch) రసాయనిక రచనా విధానాన్ని పోలి ఉంటుంది. పిండి (Starch) మోలిక్యూలుల కంటే సెల్యూలోజ్ మోలిక్యూలులు పెద్దవిగానూ, ఎక్కువ భారంగానూ ఉంటాయి. కొయ్య నుండి చక్కెరను తయారుచేయ డానికి క్రొయ్యను పూర్తిగా రంపపు పొట్టులా తయారుచేయాలి. తరువాత ఈ రంపపు పొట్టును 40 శాతం హైడ్రోక్లోరిక్ ఆమ్లద్రావణంతో పరిష్కృతం చేస్తారు. ప్రతి ఒక కొయ్య సెల్యూలోజ్ మోలిక్యూలుకు ఒక మోలిక్యూలు నీటిని కలుపుతారు. దీనివల్ల కొయ్య సెల్యూలోజ్ చక్కెరగా మారుతుంది. కొయ్య చక్కెర ఎక్కువ మధురంగా ఉండదు. అయినా మంచి పుష్టికరము, ఆరోగ్యకరము.*

## ముల్లంగి రసం

*ముల్లంగి రసం ఆకలి పుట్టిస్తుంది. కాయ గూరలలో సంవత్సరం పొడుగునా వచ్చేది ముల్లంగి దుంప. తాజా ముల్లంగి దుంపలు మూలశంకతో బాధపడేవారికి ఎంతో మేలు చేస్తుంది. ఉడక బెట్టిన ముల్లంగి మలబద్ధతను నివారిస్తుంది. కడుపు ఉబ్బసానికి కూడా ముల్లంగి పంచదార కలిపి ఇవ్వవచ్చు. అనేక అజీర్ణరోగాలకు ముల్లంగి ఆకులు మంచివి. తాజా ముల్లంగి రసం వల్ల అగ్నిదీప్తి కలుగుతుంది. ఆకలి పుడుతుంది. మంచి జీర్ణకారి.*

## మానవ కల్పిత సముద్రం

*అము-దార్యా నది జలాలతో బ్రహ్మాండమైన మానవ కల్పిత సముద్రం నింపబడింది. ఈ నది మీదుగా రాతి డామ్ నిర్మాణంలో ఏర్పడిన కృత్రిమ రిజర్వాయర్ ఒక మిలియను హెక్టేరుల నేలకు నీటివసతి కలిగిస్తూంది.*

( 2 వ పేజీ తరువాయి)

కుంటే అక్షయమైన దిగ్విజయంతో అఖండానందమైన ధార్మిక జీవితాన్ని సుస్థిరం చేసుకోవచ్చు.

పరిస్థితులెట్టివైనా తగిన ఓర్పు, సహనం వహిస్తూ ఆయా పరిస్థితులు తప్పనిసరిగా అనుభవించక తీరదు అని తీర్మానించుకుంటే జీవితం సుఖమయమనిపిస్తుంది. ఆత్మజ్యోతిని ప్రకాశింప జేసుకుంటే దివ్యశక్తి విశదమవుతుంది. విశ్వంలో స్వార్థానికి అవకాశం లేదని గ్రహించి అర్పణ చేసుకుంటే విశ్వంతో ఏకమైపోవచ్చు.

"మనుషులమధ్య మనుషులకోసం బ్రతకడం మంచితనం."

# ఆంటీడయబెటిక్ మందుల కథ

డా.ఆర్. గోపాలన్

డయబెటిస్ మెల్లిటస్ అనే మధుమేహం 500 బిసిలోనే వ్యాధిగా తెలుసుకోబడింది. 'ద్వారాపోతుంది' (to pass through) అనే అర్థమిచ్చే గ్రీకుపదంనుంచి 'డయబెటిస్' అనేపదం ఏర్పడింది. ఇది మధుమేహరోగి శరీరంద్వారా మార్పుచెందకుండాపోతూన్న చక్కెరకు సంబంధించినది. 'మెల్లిటస్' అనే మరో గ్రీకు పదానికి 'తేనె - తీపి' (Honey - sweet) అని అర్థం. మధుమేహ రోగుల మూత్రం తేనెతీపి. మూత్రంలో ఈ తీపిని భారతదేశంలో వైద్యులు 16వ శతాబ్దంలోనే కనిపెట్టారు. 17వ శతాబ్దంలో ఆంగ్లేయ వైజ్ఞానిక శాస్త్రవేత్త థామస్ విల్లిస్ మూత్రంలో తీపిని తిరిగి కనిపెట్టి మధుమేహరోగులు ఈ వ్యాధిని అదుపులో పెట్టుకోడానికి చక్కెర, ఇతర పిండి పదార్థాల వాడకం తగ్గించమని సలహా ఇచ్చాడు. 18వ శతాబ్దంలో మధుమేహరోగుల రక్తంలోనూ, మూత్రంలోనూ చక్కెర అధికంగా ఉంటుందని మరో ఆంగ్లేయ శాస్త్రజ్ఞుడు మాథ్యూ డాబ్‌సన్ రుజువు చేసాడు.

1901లో మధుమేహం లాంగర్‌హాన్స్ (Islets of Langerhans) దీవులు అనబడే చిన్న దీవులవంటి పాంక్రియాటిక్ కణాలలో బయలు దేరుతుందని రుజువుచేయబడింది. 1874లో ఈ కణాలను కనిపెట్టిన ప్రఖ్యాత జర్మన్ వైద్యుడు పాల్ లాంగర్‌హాన్స్ పేరు ఈ కణాలకు పెట్టబడింది.

లాంగర్‌హాన్స్ దీవులు ఒక తెలియని పదార్థాన్ని తక్కువగా స్రవించడంవల్ల డయబెటిస్ (మధుమేహం) కలుగుతుందని శాస్త్రజ్ఞులు 1909లో నిర్ణయ ఫలితాలను పొందారు. ఈ తెలియని పదార్థం 'ఇన్సులిన్' అనే హార్మోన్ అని ఊహించబడింది. 'ఇన్సులిన్' అంటే లాటిన్ భాషలో ద్వీపము అని అర్థం. 1910 దశాబ్దంలో ఈ తెలియని పదార్థాన్ని వేరు చేయడానికి చేసిన ప్రయత్నాలు విఫలమైనాయి. వీనిని వేరుచేయడానికి గ్రంథిని చితకగొట్టి పరిశీలించే సమయంలో వృక్యం (Pancreas) లో ఎంజైము ఇన్సులిన్‌ని ధ్వంసంచేస్తుంది.

1920 లో ఒక యువ కెనెడియన్ వైద్యుడు ఫ్రెడ్రిక్ ఇ. బాన్‌టింగ్ ఈ సమస్యను తెలుసు కున్నాడు. పాంక్రియాస్ విధ్వంసక ఎంజైమును స్రవింపజేసే వాహికద్వారాన్ని మూసి కట్టివేస్తే ఇన్సులిన్ కణాన్ని వేరుచేయవచ్చుని సిద్ధాంతరీ కరించాడు.

1921లో టొరాంటో యూనివర్సిటీలో ఫిజి యాలజీ ప్రొఫెసర్ జాన్ జె.ఆర్. మాక్లియాడ్ తన లేబొరేటరీలో ఒక విభాగంలో బాన్‌టింగ్ సిద్ధాంతాన్ని పరీక్షచేయడానికి బాన్‌టింగ్‌ను అనుమతించాడు. బాన్‌టింగ్ మరియు అమెరికా వైద్య విద్యార్థి ఛార్లెస్ హెచ్. బెస్ట్ పాంక్రియాస్‌ను గట్టిగా కట్టిపెట్టి ముక్కలు ముక్కలుగా ఖండించి ఇన్సులిన్ హార్మోన్‌ను ఉప్పునీటితో వేరుచేసారు. వృక్యగ్రంధిని తీసి వేసి ఒక కుక్కకు డయబెటిక్ వ్యాధి కలిగించి దానికి సుమారు 5 ml. ఇన్సులిన్ ద్రవాన్ని శరీరంలో ఇంజక్ట్‌చేసి ఎక్కించారు. కుక్క శరీరంలో రక్తప్రవాహంలో బ్లడ్ గ్లూకోజ్ (చక్కెర) బాగా సగానికి సగం తగ్గిపోయింది. ఆరోగ్యం చేరుకుంది.

ప్రప్రథమంగా ఇన్సులిన్ హార్మోన్ 1922లో 14 సంవత్సరాల బాలుడైన ఒక రోగికి ఇంజక్ట్

"స్వర్ణకారుని పనితనం ఆభరణాలకు వన్నె తెస్తుంది.
శిల్పుల పనితనం శిలలకు జీవం పోస్తుంది."

చేయబడింది. ఇతడు ప్రతీరోజు ఇంజక్షన్‌తో 11 సంవత్సరాలపాటు ఆరోగ్య జీవితం గడిపాడు.

ఎలి లిల్లీ అండ్‌కో వారు బాన్‌టింగ్ మరియు బెస్టుల సహాయంతో జంతు వృక్యస్రవాల నుండి ఇన్సులిన్ తయారీని 1923 లో ప్రారంభించారు. అదే సంవత్సరంలో బాన్‌టింగ్ మరియు మాక్లియాడ్‌లకు ఇన్సులిన్ పరిశోధనలకు వైద్యరంగం మరియు శరీర శాస్త్రంలో నోబెల్ బహుమానం బహూకరించబడింది. బెస్ట్‌ను అలక్ష్యంచేసారు. కోపంతో బాన్‌టింగ్ నోబెల్ బహుమతిని మొదట నిరాకరించాడు. తరువాత బహుమానం సొమ్ము తీసుకుని పరిశోధనలో మాక్లియాడ్ కంటే ఎక్కువగా సహాయపడిన బెస్ట్‌కి సగం సొమ్ము ఇచ్చాడు.

ఇంతలో పశ్చిమబెర్లిన్ హాస్పిటల్లలో ఊపిరి తిత్తుల అంటురోగ నివారణకు ఉపయోగించే కార్బుటామైడ్ అనే సల్ఫోనమైడ్ రక్తంలో చక్కెరను తగ్గిస్తున్నట్లు అకస్మాత్తుగా1 952 లో తెలుసుకోబడింది. దీనిని మధుమేహం రోగుల మీద ప్రయోగించినప్పుడు వికటించి ఇతర విలక్షణాలు ఏర్పడటంవల్ల దీని ఉపయోగాన్ని విరమించుకున్నారు. 1954లో ఫార్బ్‌వెర్కె హెక్స్‌ట్ కార్బుటామైడ్ నిర్మాణాన్ని మార్చి క్రొత్త యౌగికం (Compound) టోల్‌బుటామైడ్‌ను ప్రవేశపెట్టారు.

1955వ సంవత్సరంలో యునైటెడ్ స్టేట్స్‌లో సుప్రసిద్ధ ఫార్మస్యూటికల్‌ఫర్మ్ 'అప్‌జాన్ టోల్‌బుటామైడ్‌ను 20,000 మధుమేహ రోగుల మీద యునైటెడ్ స్టేట్స్‌లో ప్రయోగించి చూశారు. ప్రయోగఫలితాలు పూర్తిగా సంతృప్తికరంగా ఉండటంవల్ల అదే సంవత్సరంలో దీనిని అమ్మకానికి విడుదల చేసారు. మరుసటి సంవత్సరంలో ప్రపంచం అంతటా 300,000 మంది మధుమేహ రోగులు ఒరినేస్ (orinase) అనే పేరుతో టోల్‌బుటామైడ్‌ను ఉపయోగించి ఆరోగ్యాన్ని పొందారు.

తీవ్రమైన వైద్య పరిశోధనలు చేసి 1958లో ఫైజర్ (pfizer) అనే సుప్రసిద్ధ ఫార్మస్యూటికల్ సంస్థ డయబినీస్ (Diabinese) అనే క్రొత్త ఓరల్ ఆంటీ - డయబెటిక్ మందును ప్రవేశపెట్టారు. ఇదే ఇప్పుడు విస్తారంగా మధుమేహ రోగులు వాడుతూన్న ఆంటీ-డయబెటిక్ ఔషధం.

ముందుగా నిర్ణయించిన ప్రమాణంలో ఇన్సులిన్‌ని రక్తప్రవాహంలో ఇంజక్ట్ చేయడానికి 'ఇన్సులిన్ పంప్' అనే ఒక చిన్న సాధనాన్ని యునైటెడ్ స్టేట్స్ లాబొరేటరీలలో అభివృద్ధి చేస్తున్నారు.

ఇక కొద్ది సంవత్సరాలలో డయబెటిక్ రోగులలో లాంగర్‌హాన్స్ దీవులను (Islets) మార్పిడి చేసి రక్తప్రవాహంలో గ్లూకోజ్ (చక్కెర) క్రమపరచ వచ్చు.

## అధైర్య పడిపోవద్దు



అత్యల్పకాలంలో నీ ఉద్యమాలు ఫలించకపోతే అధైర్య పడిపోవద్దు. ఓపికపట్టు. ఒక్కొక్కప్పుడు ఫలితం మెల్లిగా, ఎద్దు బండిమీద వచ్చినట్టు వస్తుంది. ఎవరికి తెలుస్తుంది. ఫలితం కారులో రావచ్చు. లేకపోతే జెట్ ప్లేన్‌లో కూడా రావచ్చు!

"మహాసముద్రం వంటి మానవజాతిని విశ్వసించు. సముద్రంలో కొంతనీరు కాలుష్యమైనా మొత్తం ఎప్పటికీ కాలుష్యం కాదు."

# అవీ-ఇవీ

## గిరిజన పురావస్తుశాల

భువనేశ్వర్‌లో గిరిజన మరియు హరిజన సంస్థ శిబిరంలోని సంకీర్ణ మానవ పురావస్తు శాలలో ఒరిస్సాలో గల 62 గిరిజన జాతులు నిత్యం ఉపయోగించుకునే సాంప్రదాయక వస్తువులు మరియు కళావస్తువులు ప్రదర్శింప బడుతున్నాయి.

* * *

## నిర్మాణదశలో ఉన్న డాములు

ప్రస్తుతం భారతదేశంలో వివిధప్రదేశాలలో 10 మిలియను ఘనమీటర్ల నీటి స్టోరేజికి



మరియు దానికి పైబడిన సమర్థత గల 276 డాములు నిర్మాణదశలో ఉన్నాయి.

## పూతినాశిని మందుల విషప్రభావం

అభివృద్ధిపొందుతూన్న వర్థమానదేశాలలో సాలీనా 40,000 మంది పూతినాశిని మందుల విషప్రభావానికి గురి అవుతూంటే, మరో 10,000 మంది దీని విషప్రభావం వల్ల మరణిస్తున్నారు. బలిగొన్నవారు చాలామంది పొలాలలో పని చేసేవారే.

## 2,600 సంవత్సరాలనాటి ప్రాచీన సారాబట్టీ యంత్రం

పశ్చిమ ఆసియా ఇజ్రేల్‌లో ఎల్-జిబ్ అనే గ్రామంలో 2,600 సంవత్సరాలనాటి మిక్కిలి ప్రాచీన వైన్ (సారా) తయారీ యంత్రాన్ని పురావస్తుశాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

* * *

## గొలుసు లేని బైసికిల్

యుగోస్లేవియాలో నోవి సాడ్ (Novi Sad) అనే ప్రదేశంలో ఒక నవ్యవస్తు కల్పనా చతురుడు గొలుసు లేకుండా తిరిగే బైసికిల్‌ను కనిపెట్టాడు. ఇది సాధారణరకం సైకిల్‌లో నాల్గవవంతు తేలిగ్గా ఉంటుంది. పెడల్ లీవర్లు చాలా పొట్టిగా ఉండటంచేత దీనిమీద సుఖంగా స్వారీ చేయవచ్చు.

## 10 మిలియనుమంది పిల్లలు సాలీనా మరణిస్తున్నారు

అభివృద్ధిపొందుతూన్న దేశాలలో సక్రమ పోషకాహార లోపం వల్ల, కష్టమైన కాన్పులు మరియు పిల్లల రోగాల వల్ల ప్రతీ సంవత్సరం 10 మిలియను మంది పిల్లలు మరణిస్తున్నారు.

-'వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్' సౌజన్యంతో

"తెలివితక్కువ స్నేహితులతో కన్నా ఏకాంతంగా ఉండటం ఎంతో మేలు."

## 6,507 రకాల సిగరెట్ల బ్రాండులు

యునైటెడ్ స్టేట్స్ న్యూయార్క్‌లో రాబర్ట్ ఇ. కాఫ్‌మాన్ (Robert E. Kaufman) 161 దేశాల నుంచి 6,507 రకాల వివిధ బ్రాండుల సిగరెట్లను సేకరించాడు.

*  *  *

## 82వ ఏట పిహెచ్.డి. అవార్డు

లక్నోలో జన్మించిన సత్యాశర్మ అనే 82 సంవత్సరాల వృద్ధుడికి వయో మరియు సాముదాయక విద్యావిధానంలో యుఎస్ఎ ఓక్లహామా యూనివర్సిటీ వారు పిహెచ్.డి.ని ఇచ్చి బహూకరించారు. ఇతడు భారతదేశంలో ఉత్తరప్రదేశ్ ప్రభుత్వంలో 36 సంవత్సరాలు పనిచేసాడు.

## ఒకే రోజున 5 కోట్ల LIC వ్యాపారం

అహమ్మదాబాద్ నగరం లైఫ్ ఇన్‌సూరెన్స్ కార్పొరేషన్ ఏజెంట్ జయప్రకాష్ ఆర్. జాని మొత్తం రూ.10.44 కోట్ల విలువ చేసే 2066 క్రొత్త ప్రతిపాదనలను 31 మార్చి 1989కి పరిచయం చేసాడు. వీటిలో మార్చి ఆఖరు రోజున రూ.5 కోట్ల విలువ చేసే 835 క్రొత్త ప్రతిపాదనలను (ప్రపంచరికార్డు) పరిచయ పరచాడు.

## 140 మిలియను సంవత్సరాల నాటి డైనోసార్

వాయవ్య చైనాలో గోబీ ఎడారిప్రదేశంలో ఇటీవల చైనా మరియు కెనడా శాస్త్రజ్ఞులు 30 మీటర్ల పొడవైన డైనోసార్ అవశేషాలను కనుగొన్నారు. 140 మిలియను సంవత్సరాల నాటి ఈ డైనోసార్ అవశేషాలు ఆసియాలోను మరియు ప్రపంచంలోనే మిక్కిలి పెద్దది. దీంట్లో పూర్తి కపాలభాగం, వెన్నెముకప్రక్కన ఎముకలు 10 ముక్కలు ఉన్నాయి.

*  *  *

## వాన్ గోగ్ పెయింటింగ్

సుప్రసిద్ధ డచ్ పెయింటర్ విన్‌సెంట్ వాన్ గోగ్ చిత్రించిన పోర్‌ట్రెయిట్ 1990 మే లో యుఎస్ఎ న్యూయార్క్‌లో క్రిస్టీస్ ఏలంలో 82.5 మిలియను డాలర్లకు అమ్మ బడింది. ఏలంలో రికార్డు వెల లభించిన చిత్రం ఇది.

## విజయానికి కిటుకు



పని - ఆనందానికి గర్వకారణం
ఆలోచన - శక్తిసామర్థ్యాలకు ఆధారం
ఆట - నిత్య యౌవ్వనానికి రహస్యం
చదువు - విజ్ఞానానికి పునాది
స్వప్నం - ఉత్తమ ఆశయాలకు సోపానం
నవ్వు - సుశ్రావ్యమైన ఆత్మసంగీతం

"ప్రయత్నిస్తేగానీ సామర్థ్యత తెలియదు. దిగితేగాని లోతు తెలియదు."

# ప్రార్థన అంటే?

ప్రార్థన నా ప్రాణరక్ష. అదిలేకపోతే నేను ఏనాడో పిచ్చివాడినై ఉండేవాడిని.

రాజకీయంగా, వ్యక్తిగతంగా నేను పొందిన చేదు అనుభవాలు స్వీయచరిత్రే తెలియ జేస్తుంది. అవి తాత్కాలికంగా నాకు నిరాశ కలిగించాయి. కానీ ప్రార్థనవల్లే దానిని పోగొట్టుకో గలిగాను.



నేను గొప్ప పండితుడినికాను. నేను ప్రార్థనకు అలవాటుపడ్డ మనిషిని. మూర్తి నాకు ముఖ్యంకాదు. ఈ విషయంలో ఎవరిధర్మం వారిది. కొన్ని కొన్ని ప్రసిద్ధమైన మంచిమార్గాలు ఉన్నాయి. అందరూ నడిచేమార్గం. గురువులు నడిచిన దారిలో వెళ్లడం నిరపాయకరం.

హృదయపూర్వకమైన ప్రార్థన నోటితో వల్లించడంకాదు. మానసికమైన తీవ్రపరితాపం. ప్రతీమాటలో, ప్రతీపనిలో, ప్రతీభావంలో స్ఫురించే పరితాపం.

చెడుబుద్ధి పుట్టింది అంటే అది నోటితో మాత్రం చెప్పిన ప్రార్థన ఫలితమని తెలుస్తుంది. అలాగే మాట్లాడేటప్పుడు దొర్లిన దుష్ప్రలాపం అయి ఉండవచ్చు. లేకచేసిన దుష్కర్మ కావచ్చు.

వాస్తవమైన ప్రార్థన పరిపూర్ణమైన రక్ష. పాపాలను పోగొట్టగల దివ్యరక్ష. చైతన్యవంతమైన ఇట్టి ప్రార్థనలో విజయం మొదటి ప్రయత్నంలో కనిపించకపోవచ్చు. తీవ్రంగా శ్రమించి ప్రయత్నించాలి. మనలోమనకి విశ్వాసం ఉండాలి.

కాబట్టి ప్రార్థనాశక్తిని తెలుసుకోవాలంటే అనంతమైన సహనశక్తిని అలవరచుకోవాలి.

—మహాత్మాగాంధీ

## 'ఏప్రిల్ ఫూల్స్'డే

*ఏప్రిల్ ఫూల్స్ డే 1564 వ సంవత్సరం నుంచీ ఆచరింపబడుతూంది. పూర్వం ఏప్రిల్ ఒకటవ తేదీ సంవత్సరాది దినంగా ఉండేది. 1564 లో జనవరి ఒకటవ తేదీ సంవత్సరాది దినంగా నిర్ణయింపబడి అదే ప్రతీ సంవత్సరం ఆచరింపబడేది. ఈ మార్పు జనంలో కంగారు కలిగించింది. ఒకరిని ఒకరు హాస్యం చేసుకోవడం, ఎగతాళి చేసుకోవడం ప్రారంభమైంది. ఒకప్పుడు సంవత్సరాదిగా ఆచరింపబడే ఏప్రిల్ 1 వ తేదీన హాస్యంగా గ్రీటింగ్‌లను పంపుకోడం ప్రారంభించారు.*

*ఏప్రిల్ మొదటిరోజు 'మీనరాశి'తో ప్రారంభ మవుతుంది కాబట్టి ఫ్రాన్స్‌లో ఎగతాళి చేయబడ్డ వ్యక్తిని "పాయిస్సాన్ డి అవ్‌రిల్" అంటే 'ఏప్రిల్ ఫిష్' అనేవారు. స్విట్జర్లాండ్‌లో ఏప్రిల్ 1న కొంత మంది బ్రహ్మచారులు వారు ప్రేమించిన యువతుల ఇండ్లలో చెట్లను నాటుతారు. ఏప్రిల్ ఫూల్ జోకులను బ్రిటిష్ వారు అమెరికాలో ప్రవేశ పెట్టారు. ఇప్పుడు ప్రపంచం అంతటా ఏప్రిల్ ఫూల్ జోకులు అందరికీ తెలును.*

"సంతృప్తి సహజంగా అబ్బే సౌభాగ్యం,
విలాసం కృత్రిమంగా తెచ్చిపెట్టుకునే దారిద్ర్యం."

# బీజింగ్ ఆసియా క్రీడలు 1990

(నిజాలు—నిదర్శనాలు)

11వ ఆసియాదేశపు క్రీడలు పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా ముఖ్య పట్టణం బీజింగ్‌లో 1990 సెప్టెంబరు 22 నుంచి అక్టోబరు 7 వరకు నిర్వహింపబడ్డాయి. ముద్దు ముద్దుగా ఉండే పాండా "పాన్‌పాన్" ఈ క్రీడల ప్రత్యేక చిహ్నాము(mascot). క్రీడలలో 36 దేశాలు పాల్గొన్నాయిఅంటే ప్రపంచ జనాభాలో 54 శాతం అని అర్థం.



బేస్‌బాల్ మరియు సాఫ్ట్ టెన్నిస్ ప్రత్యక్ష నిరూపక (Demonstration) క్రీడలుగా మొత్తం 27 క్రీడలలో 308 స్వర్ణపతకాలకు పందేలు నిర్వహించబడ్డాయి.

మొత్తం 2,253 పందేలలో 3,222 పురుషులు మరియు 1,462 స్త్రీలు మొత్తం 4,684 మంది ఈ పందేలలో పాల్గొన్నారు.

ఆసియా క్రీడల జ్యోతిని టిబెట్‌లో లాసా (Lhasa)కు 100కి.మీ.లు ఉత్తరంగా నిజెయిన్‌జెన్ టాన్‌గ్లా (Nijaingen Tanglha) పర్వతశిఖరం క్రింద వెలిగించి చైనీస్ ముఖ్య పట్టణం బీజింగ్‌కు తీసుకు వచ్చారు. 602 మందితో ప్రపంచంలో మిక్కిలి పెద్ద మిలటరీ బాండ్ పాటలతో జ్యోతి ప్రారంభోత్సవాలలో 70,000 మందికి సరిపోగల వర్కర్స్ స్టేడియంలోకి ప్రవేశించింది.



చైనీయులు 17 కొత్త స్టేడియాలు నిర్మించారు. 16 పాత స్టేడియాలను క్రొత్తవిగా చేసారు. పెద్ద ఆసియా క్రీడలవాడలో 2 పెద్ద పెద్ద హొటళ్ళు, 500 అపార్ట్‌మెంట్లు, 34కి.మీ.ల రోడ్లతో ఫ్లైఓవర్లు నిర్మించబడ్డాయి.

## నా నిత్యప్రార్థన మరియు తాపత్రయం

*మొట్టమొదట యుద్ధకాలంలో అబ్రహాం లింకన్ ఒక క్రైస్తవ మతాధికారితో 'మనకో దృఢ విశ్వాసం ఉండాలి' అన్నప్పుడు గంభీరంగా 'ఈ పోరాటంలో పరమాత్ముడు మనవైపు ఉన్నాడు' అని మంత్రి అన్నాడు.*

*దానికి లింకన్ 'దాంతో నాకు నిమిత్తం లేదు. దేవుడు ఎప్పుడూ ధర్మం వైపు ఉంటాడు. గానీ నేను, నా రాజ్యం భగవంతుని వైపు ఉండాలనేదే నా నిత్య ప్రార్థన, తాపత్రయం' అని అన్నాడు.*

"ప్రేమించినవారికి దూరమైనప్పుడు
అది మరణం కన్నా ఘోరం అనిపిస్తుంది."

ప్రారంభోత్సవం, సమాప్తి ఉత్సవం, ఫుట్ బాల్ ఫైనల్స్ బ్రహ్మాండమైన ఎలక్ట్రానిక్ స్కోర్ బోర్డు, వీడియో ప్రదర్శన సౌకర్యంగల బీజింగ్ వర్కర్స్ స్టేడియంలో నిర్వహింపబడ్డాయి. బీజింగ్ 10 మిలియను జనాభాలో 7.97 మిలియను మంది ఆసియాక్రీడలకు సంబంధించిన కార్యక్రమాలలో పాల్గొన్నారు. క్రీడా సమయంలో బీజింగ్ ఒక పూలతోటగా మారిపోయింది. రెండు మిలియను పూలకుండీలు, నాలుగు మిలియను మొక్కలు నగరవీధులను అలంకరించాయి.



838మంది స్త్రీలు, పురుషులతో చైనా జట్టు మిక్కిలి పెద్దది. దీని తరువాత 757 మందితో దక్షిణ కొరియా ద్వితీయస్థానాన్ని పొందుతుంది. జపాన్ జట్టులో 722 మంది పాల్గొన్నారు. 12 సం.ల చైనీస్ గరల్ డైవర్ ఫూ మిన్‌గ్‌క్సియా పోటీలో పాల్గొన్నవారిలో మిక్కిలి చిన్నది. పురుషులలో థాయ్‌లాండ్ కసరత్తు యోధుడు సాహియర్ వారిట్ వయస్సు 13 సంవత్సరాలు.

చైనీస్ బాస్కెట్‌బాల్ క్రీడాకారుడు షాన్ టావో మిక్కిలి ఎత్తైన పురుషుడు. ఇతడి ఎత్తు 2.15 మీటర్లు. పురుషులలో చైనీస్ క్రీడాకారుడు సున్ మాయి మిక్కిలి పొట్టివాడు. ఇతడి ఎత్తు 1.42 మీటర్లు. ఇతడే 35 కేజీలు తూగే మిక్కిలి తక్కువబరువున్నవాడు.

బీజింగ్ ఆసియా క్రీడలలో 'వుషు' అనే చైనా దేశపు యుద్ధకళను మొట్టమొదటిసారి ప్రవేశపెట్టారు. పశ్చిమంలో 'కుంగ్-ఫూ' అని చెప్పబడే 'వుషు' నైపుణ్యానికి 3,000 సంవత్సరాల సాంప్రదాయకత ఉంది. ఇది ప్రాచీన చైనా తత్త్వ శాస్త్రాన్ని సైనిక విజ్ఞానంతోనూ, వైద్య విజ్ఞానంతోనూ మరియు శారీరక వ్యాయామంతోనూ మేళవిస్తుంది.


P.T. USHA

అన్ని క్రీడలలోను చైనా ఇతరదేశాలపై దిగ్విజయంగా ఉంటూ 183 స్వర్ణపతకాలు, 107 వెండి మరియు 51 కాంస్య పతకాలను గెలుచుకుంది. దక్షిణకొరియా 54 స్వర్ణపతకాలతో మొత్తం 181 పతకాలను, జపాను 38 స్వర్ణపతకాలతో మొత్తం 174 పతకాలను పొందాయి.

కసరత్తు పందేలలో పురుషుల మరియు మహిళల పందేలలో చైనీయులు టీమ్ టైటిల్స్ గెలుపొందారు. ఈతలో చైనీస్ మహిళలు 15 స్వర్ణపతకాలను పొందారు. 22 సం.ల

"వివేకవంతులు స్వానుభవంనుంచి, మహనీయుల అనుభవాలనుంచి పాఠం నేర్చుకుంటారు."

వయస్సుగల చైనీస్ సైకిలిస్టు జౌహ్ లింగ్మై (Zhou Lingmei) మహిళలకు నిర్వహించబడిన 1కి.మీ. టైమ్‌ట్రయల్‌ను 1:13.899 సెకండ్లలో పూర్తిచేసి స్వర్ణపతకాన్ని పొందింది. పోల్ వాల్ట్‌లో చైనీస్ లియాంగ్ క్సురీన్ 5.62 మీటర్ల స్కోరుచేసి స్వర్ణపతకాన్ని గెలుచుకుని రికార్డు స్థాపించాడు. 14 సంవత్సరాల చైనీస్ బాలుడు సున్ మావీ ప్లాట్‌ఫారమ్ డైవింగ్‌లో స్వర్ణపతకాన్ని గెలుచుకున్నాడు.



భారతదేశం మొత్తం 27 క్రీడలలో 16 క్రీడలలో పాల్గొంది. ఒక స్వర్ణపతకం, 8 రజత పతకాలు, 14 కాంస్య పతకాలు మాత్రమే గెలుచుకుంది. మొట్టమొదటిసారిగా మెడల్ క్రీడగా ప్రవేశపెట్టబడిన కబడిలో భారతదేశం ఒక స్వర్ణ పతకాన్ని గెలుచుకుంది.

1951నుంచి భారతీయ క్రీడాకారులు ప్రతీ ఆసియా క్రీడలలోను సెబాష్ అనిపించు కున్నా బీజింగ్ క్రీడలలో చైనా, దక్షిణ కొరియా, మరియు జపాన్ దేశాలను అధిగమించలేక పోయారు. 1986 సియోల్ ఆసియా క్రీడలలో నాలుగు స్వర్ణపతకాలను గెలుచుకున్న పరుగుల రాణి పి.టి. ఉష బీజింగ్ క్రీడలలో మూడు రజత పతకాలను మాత్రమే గెలుచుకోగలిగింది.

ఢిల్లీలో జరిగిన 1951 ఆసియా ప్రారంభ క్రీడలలో భారతదేశం 16 స్వర్ణపతకాలను (అత్యధికం) పొందింది. బీజింగ్ క్రీడలలో అతితక్కువ స్వర్ణపతకాలు లభించాయి.

పురుషుల టేబిల్ టెన్నిస్ ఆటలో దక్షిణ కొరియా ఉత్తర కొరియాను 5—4తో ఓడించింది. 20 సంవత్సరాలపాటు ప్రపంచ టేబిల్ టెన్నిస్ ఘనతను కాపాడుకున్న చైనా ఒక స్వర్ణపతకంగానీ, రజత పతకంగానీ గెలుచుకోలేక పోయింది. కాంస్యపతకం మాత్రమే పొందగలిగింది.

16 సంవత్సరాల పాఠశాల విద్యార్థిని దక్షిణ కొరియా లీ జాంగ్మి అదే దేశానికి చెందిన వరల్డ్ ఒలింపిక్ ఆర్చెరీ ఛాంపియన్ కిమ్ సూన్యాంగ్‌ను వ్యక్తిగత మహిళల చివరి ఓడించింది. 339 పాయింట్లతో

(మిగతా 12 వ పేజీలో)

## "విస్డమ్" పాతకాపీలు

*ఫిబ్రవరి '83; మార్చి '84, మే '84, జూన్ '84, ఆగష్టు '84 నుంచీ నవంబరు '84; జనవరి '85, మార్చి '85 నుంచీ జూలై '85, జనవరి '86 నుంచీ డిసెంబరు '86; జనవరి '87 నుంచీ మే '87, జూలై '87, ఆగస్టు '87, అక్టోబరు '87 నుంచీ డిసెంబరు '87; జనవరి '88 నుంచీ డిసెంబరు '88; జనవరి '89 నుంచీ డిసెంబరు '89; జనవరి '90 నుంచీ డిసెంబరు '90 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీవెల పై.0.75లు; 1984 కాపీల వెల రూ. 8.75లు; 1985 కాపీల వెల రూ. 8.00లు; 1986 కాపీల వెల రూ. 18.25లు; 1987 కాపీలవెల రూ.16.00లు 1988 కాపీలవెల రూ. 20.25లు; 1989 కాపీల వెల రూ. 24.50లు; 1990 కాపీల వెల రూ. 28.00లు. రిజిష్టర్డ్‌పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 6.00లు చేర్చి M.O. పంపాలి. 'రత్నాఏజెన్సీస్', 9, దేశికారోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.*

—సర్క్యులేషన్ మేనేజర్

"సామర్థ్యంతోపాటు సౌశీల్యం ఉంటేనే
జీవితం చరితార్థమవుతుంది."

# చిట్టి దేవతలకు చిన్న కథలు

## సాలీడు - తేనెటీగ

పూర్వం చాలా కాలం ముందు ఒకప్పుడు ఒక తల్లికి ఇద్దరు బిడ్డలు పుట్టారు. ఒక సాలీడు, ఒక తేనెటీగ. సాలీడు అన్న, తేనెటీగ చెల్లెలు. సాలీడు, తేనెటీగ పెరిగి పెద్ద అయిన తరువాత తల్లి ఇంటి నుంచి వెళ్ళి పోయాయి. సాలీడు నేత పని పెట్టుకున్నాడు. తేనెటీగ పూవుల తోటలో తేనె కూడబెడుతూంది.



ఒక రోజున సాలీడు పట్టుదారాల కంటే సన్నని పోగులతో గూడు అల్లుతూ కూర్చున్నాడు. ఇంతలో ఒక పెద్ద నల్లి ఎగురుతూ వచ్చి 'త్వరగా నాతో బయలుదేరు. మీ తల్లి చావు బ్రతుకులతో ఉంది. బ్రతికి ఉండగానే నిన్ను, నీచెల్లెలిని ఒక్కసారి చూడాలని ఆమె చివరి కోరిక. నా వీపు మీద కూర్చో. నేను తీసుకు వెడతాను' అని ఆయాసపడుతూ కంగారుగా చెప్పింది.

'నీకు ఎలా తెలుసు నా తల్లి చచ్చిపోతుందని?' కొంచెం అనుమానిస్తూ [illegible].

( 11 వ పేజీ తరువాయి)

ఈమెకు స్వర్ణపతకం లభించింది. ఆర్చెరీ పురుషుల మరియు మహిళల టీమ్ టైటిల్స్‌లో స్వర్ణ పతకాలు దక్షిణ కొరియాకు లభించాయి. పురుషుల విభాగంలో దక్షిణ కొరియాకు చెందిన కిమ్ వోన్‌టక్ మరాథాన్ గెలుచుకున్నాడు.

పురుషుల హాకీలో పాకిస్థాన్ భారతజట్టును 3—2తో ఓడించి స్వర్ణపతకాన్ని గెలుచుకుంది 400 మీటర్ల హర్డిల్స్ పందెంలో పాకిస్థాన్ పోలీస్‌మెన్ గులాం అబ్బాస్ 50.15 సెకండ్లలో పూర్తిచేసి విజయం పొందాడు. 32 సంవత్సరాలలో పాకిస్థాన్‌కు అథెలిటిక్స్‌లో స్వర్ణపతకం లభించడం ఇదే ప్రప్రథమం.

శ్రీలంకా స్ప్రింటర్ ఎస్. డిస్సనాయకె 200 మీటర్ల పందెంలో రజతపతకాన్ని పొందాడు

పురుషుల ఫుట్‌బాల్ పోటీలో ఇరాన్‌కి స్వర్ణ పతకం లభించింది. ఇరాన్ ఉత్తర కొరియాను 4—1 తో ఓడించింది. పురుషుల 400 మీటర్ల పందెంలో ఒమాన్‌కుచెందిన మహమ్మద్ అల్ - హార్లేకి స్వర్ణపతకం లభించింది. ఖ్వాటార్‌కి చెందిన మహమ్మద్ సులైమాన్ 1500 మీటర్ల పందెంలో ప్రథమస్థానం పొందాడు.

20 సంవత్సరాల తరువాత ఆసియాక్రీడలలో చాల్గొన్న తైవాన్‌కి స్వర్ణం లభించలేదు. అయితే 31 ఇతర పతకాలను గెలుచుకుంది. అథెలిటిక్స్‌లో పేరుపొందింది.

"మంచివిమర్శకు బుద్ధికుశలత, వివేకం ముఖ్యం."

ఇలాగ అనేకసార్లు జరిగింది. నా పని నేను వదిలేసి ఇప్పుడు రాలేను' అన్నాడు సాలీడు.

'అయితే నీ తల్లికి ఏం చెప్పమన్నావు? నీవు ఎందుకు రాలేదని తప్పకుండా నన్ను అడుగుతుంది.'



'నేను పని తొందరలో ఉన్నానని చెప్పు. పని ఆగదు. నేను వస్తే మా అమ్మ బ్రతుకుతుందా? నేను లేకపోయినా చావక మానదు. నా కాలం వ్యర్థం చేయక వెళ్ళు' అని చెప్పి గూడు అల్లుకోవడం ప్రారంభించాడు.

తన తల్లి మరణావస్థలో ఉందని వినీ వినడంతోటే తేనెటీగ మూర్ఛపడిపోయింది. పెద్ద నల్లి దాని ముఖం మీద తెప్పరిల్లడానికి కొంచెం నీళ్లు చల్లిలేపింది. తేనెటీగ తెలివి రావడంతోటే నల్లితో వెంటనే బయలు దేరింది. తేనెటీగను చూడడంతోటే తల్లికి పట్టరాని సంతోషం కలిగింది.

'అమ్మా! తల్లీ వచ్చావా. మీ పిల్లలందరూ నన్ను నీవు చూసుకున్నట్టే నిన్ను చూసు కుంటారు. నాలుగు కాలాలపాటు నీవు జీవించాలి. మీ కుటుంబం చెట్ల మీద ఆకుల్లాగా, సముద్రపు గట్టున ఇసుక రేణువులు లాగా వృద్ధి పొందాలి. తోటల్లో పువ్వులు నీకు [illegible] [illegible]స్తాయి. పువ్వుల పుప్పొడి మకరందం పుష్కలంగా లభిస్తుంది. లోకంలో ప్రజలు నీ విచ్చే తేనెకు నిన్ను ఎంతో మెచ్చు కుంటారు' అంటూ తల్లి కూతురిని దీవించింది.

కొంచెంసేపటికి తల్లి చనిపోయింది మరణించ డానికిముందు 'నాకొడుకు సాలీడు ఎప్పుడూ ఒంటరిగా జీవించాలి. జీవితాంతంగూడు అల్లుకుంటూండాలి. తను సుఖం పొందలేకుండా ఉంటాడు. ఇంకొకరికి సుఖం కలిగించలేకుండా ఉంటాడు. అందరూ ఆ గూటిని ఎప్పటికప్పుడు పాడుచేస్తూంటారు. ఆఖరుకి ఈగలుకూడా దానిని ఎంతమాత్రం మెచ్చుకోవు. నామాటలు నిజం అవాలి!' అని శపించింది.

ఆనాటినుంచి తేనెటీగలు ఒకే కుటుంబంగా జీవిస్తున్నాయి. జనం మెచ్చుకోని వాళ్లులేరు. వారికి తియ్యని తేనెను ఇస్తూంది.

సాలీడు ఒక చీకటి మూల గూడు అల్లుకుంటూ ఒంటరిగా కూర్చుంటూంది. జనం ఎప్పటికప్పుడు గూడును తీసేసి సాలీడును తరిమేస్తున్నారు. ఈగలుకూడా గూటిలో చిక్కుకుని సాలీడుని తిట్టిపోస్తాయి.

తల్లిమాటలు నిజమైనాయి.

## జ్ఞానం గురించి

* జ్ఞానం ఎవరు గ్రహిస్తారు? యోచనా సమర్థులు.
* పాండిత్య సౌభాగ్యమే నిజమైన భాగ్యం.
* మూర్ఖుల భాగ్యం కంటే పండితుల పేదరికమే గొప్పది.
* వ్రాత చేతకానివాని జీవితం గాడిద దొర్లుతూన్న నేలమీద సూర్పుడం వంటిది.
* నేర్పించేవారు కన్ను తెరిపిస్తారు.
* ఏదైనా నశించిపోతుంది కానీ విద్య ఎన్నటికీ నశించదు.

"ఇంటిని మించిన పాఠశాల లేదు. తలిదండ్రులను మించిన గురువులు లేరు." -గాంధీజీ

# ఆకాశాన్ని అంటే భవనాలలో ఉద్యోగులు

భువన్‌మోహన్

గాలీ, వెలుతురు బాగా ప్రవేశించే ప్రదేశాలలో పనిచేయడం ఆరోగ్యకరమని చెప్పబడినా ఈనాడు పెద్ద పెద్ద నగరాలలో నిర్మింపబడిన ఆకాశాన్ని అంటుతూన్న అనేక అంతస్థుల భవనాలలో ఉద్యోగస్థులు గాలీ, వెలుతురు చొరని మూసివేయబడిన గదులలో పనిచేయవలసివస్తూంది.



ఇటువంటివారు ఆరోగ్యరక్షణకు అదనపు జాగ్రత్తలు వహించాలి. వీరు సింథటిక్ బట్టలు ధరించకూడదు. సింథటిక్ కాని బాగా ఎడంగా నేయబడిన నూలుబట్టలు ధరించాలి. దీనివల్ల శుభ్రమైన తాజాగాలి శరీరానికి తగలడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. చర్మం బిరుసెక్కిపోదు. వీరు ఆఫీసు పనిలేనప్పుడు విస్తారంగా మంచిగాలి ప్రసరించే వాతావరణంలో కొంతకాలం గడపాలి. వెలుతురు, గాలి ధారాళంగా ప్రవేశించే ఇళ్లలో నివసిస్తూండాలి. సాధారణంగా ఇటువంటివారు ప్రతిరోజూ ప్రొద్దున్న, సాయంత్రం దగ్గరగా ఉన్న పార్కుల వంటి విశాల ప్రదేశాలలో తిరుగుతూ ఉండాలి. కొద్దిగా వ్యాయామంకూడా చేస్తూండాలి.

ప్రతిదినం 'వాయుస్నానం' చేయడం ఉత్తమం. దీనికి అవసరమైన అత్యధమం బట్టలు ధరించాలి. శరీరానికి మంచిగాలి తగిలేటట్టు చూసుకోవాలి. దీనివల్ల ఎంతో హాయిగా, ఉత్తేజకరంగా ఉంటుంది. ప్రాణాయామం ఆరోగ్యాభివృద్ధికి ఎంతో సహకరి

## తెలుసుకోదగిన విషయాలు

### కోడి ఒకే వస్తువును చూడలేదు

*కోడికి కళ్లు తల రెండు ప్రక్కల ఏర్పాటై ఉంటాయి. అందుచేత ఒకేసారి ఒకే వస్తువుని రెండుకళ్లతోను చూడలేదు. మొట్టమొదట ఒక కంటితో మనని చూస్తుంది. తరువాత తలత్రిప్పి రెండవ కంటితో చూస్తుంది.*

### కట్టుడు దంతాలకంటే బలిష్ఠమైనవి అసలు దంతాలు

*మంచి ఆరోగ్యంగా ఉన్న దంతాలతో కట్టుడుపళ్ల కంటే ఎనిమిది రెట్లు గట్టిగా కొరకవచ్చు.*

### ప్రపంచంలో భాషలు

*ఫ్రెంచి అకాడమీ వారి రిపోర్టు ప్రకారం ప్రపంచంలో మాట్లాడుకునే భాషలు దగ్గర దగ్గర 3,000 ఉన్నాయి.*

"తన్ను తాను తెలుసుకోలేని విజ్ఞానం నిరర్థకం."

స్తుంది. దీనివల్ల శరీరంలో అంగాలు ఆరోగ్య కరంగా ఉండటమేగాక నాడీమండలం బల పడుతుంది. రోజూ రెండుపూటలూ ప్రొద్దున్న, సాయంత్రం ప్రాణాయామం చేస్తూండాలి. గాలి అంత చల్లగాలేనప్పుడు ఆరుబయట నిద్రించడం ఎంతో మంచిది.

ఈత కొట్టడానికి సౌకర్యం ఉంటే ప్రతిరోజూ నీటిలో ఈదటం ఆరోగ్యదాయకం. ఇది ఒక ఉత్తమోత్తమమైన వ్యాయామం. కానీ ఇక్కడ ఒక విషయం ముఖ్యంగా గమనించాలి. స్విమ్మింగ్ పూల్స్‌లో నీరు స్వచ్ఛంగా పరిశు భ్రంగా ఉండాలి. నీటిలో అధికంగా క్లోరీన్ ఉండకూడదు. పెద్ద పెద్ద నగరాలలో స్విమ్మింగ్ పూల్స్‌లో సాధారణంగా క్లోరీన్ అధికంగా ఉంటుంది. ఇటువంటి నీటివల్ల కళ్లు ఉబ్బుతాయి, జలుబుచేస్తుంది. ఊపిరి తిత్తుల రోగాలు బయలుదేరతాయి.

మూసివేసిన గదులలో పనులుచేసేవారు సామాన్యంగా టాయిలెట్ సోపులు ఉపయో గించకూడదు. సోపులకు బదులుగా సున్ని పిండి, సీకాయిపొడివాడటం చాలా మంచిది. స్నానంచేసిన తరువాత టర్కీష్‌తువ్వాలుతో ఒంటిని గట్టిగా తుడుచుకోవాలి. శరీరంలో రక్తప్రవాహం బాగా జరగడానికి స్నానానికి ముందు ఒంటిని మర్దనాచేసుకోవాలి. నూనెతో కూడా మర్దనా చేసుకోవచ్చు.

ఆహారవిషయంలో జాగ్రత్త వహించాలి. ఉత్తేజాన్ని కలిగించే టీ, కాఫీ, కోలావంటి పానీయాలు, ఆల్కహాల్ వాడకూడదు. ఇవి నరాలకు, రక్తప్రవాహానికి హానికరము. ఆరోగ్య కరమైన ఆహారం మితంగా వాడటం మంచిది.

—'లైఫ్ నేచురల్' సౌజన్యంతో

# 'ఓరిక్స్' పరిసరానుగుణ్యాత



*మిక్కిలి బ్రహ్మాండంగా పరిసరానుగుణ్యాతగల జంతువు - ఓరిక్స్ (Oryx). ఇవి మొట్టమొదట అరేబియన్ పెనిన్సులాలో విచ్చలవిడిగా తిరుగు తూండేవి. తీక్షణమైన ఎండవేడిని తట్టుకోగల తెల్లటి చర్మం గల ఓరిక్స్ జింకవంటిది. దీనికాళ్లకు గిట్టలు వెడల్పుగా ఉంటాయి. ఎడారులలో అక్కడక్కడ బయలుదేరిన గడ్డిని మేయడానికి, మెత్తని ఇసుకలో బహుదూరం వెళ్లడానికి ఇవి సహకరిస్తాయి. దీని నీటి పొదుపు విధానం విచిత్రంగా ఉంటుంది. మేతతో దానికి అవసరమైన నీటిని రిసైకిల్ చేసు కుంటుంది. సుమారు 11 మాసాల వరకు నీళ్లు త్రాగకుండా కూడా ఉండగలదు ఓరిక్స్ ఎడారి పరిసరాలకు చాలా అనుగుణ్యాంగా ఉంటుంది గత రెండు దశాబ్దాలుగా ఓరిక్స్‌ని వేటాడటం పెద్ద క్రీడగా పరిణమించింది. ఈ జాతి తీవ్రంగా నశించిపోతూండడం వల్ల 1962 లో వాటిని రక్షించడానికి కావలసిన జాగ్రత్తలను తీసుకోడానికి 'ఆపరేషన్ ఓరిక్స్' ప్రారంభించబడింది. 1988 సెప్టెంబరు నాటికి ప్రపంచ వ్యాప్తంగా400 ఓరిక్స్‌లు ఉన్నాయి. వీటిలో 46 అరేబియా పెనిన్సులాలో ఎడారి మొక్కలు బాగా పెరిగిన ఓమన్ రాతి మైదానం జిడ్డట్- అల్- హరాసిస్‌లో ఉన్నాయి.*

*—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో*

**ఆత్మజ్ఞానమే మోక్షానికి ఏకైకసాధనం.”**

# దేవుడు మరియు మానవుడు

సుస్థిరమైన గృహవసతిలేని ఒక పేద యువకుడు ఒక వృద్ధ సన్యాసిదగ్గరకు వెళ్ళి సహాయం అర్థించాడు. ఆ వృద్ధ సన్యాసి మఠానికి చెందిన విస్తారమైన ఎస్టేటులో రాతి మయమైన రెండు హెక్టేరుల భూమిని ఇచ్చాడు.

యువకుడు అమితోత్సాహంతో భూమిని త్రవ్వి రాళ్లను తీసివేసాడు. భూమిని మెత్తగా దున్నాడు. సకాలంలో విత్తనం జల్లాడు. విత్తనం జల్లిన కొన్ని నెలలకే వంట పుష్కలంగా పండింది. పొలం పచ్చగా ఉంది.

ఒక రోజున వృద్ధ సన్యాసి క్రొత్తగా పండించిన పొలంప్రక్కనుంచి వెడుతున్నాడు. దూరంనుంచి యువకుడు చూసి సన్యాసి దగ్గరకు పరుగెత్తివెళ్లి నమస్కారంచేసి కృతజ్ఞతను తెలుపుకున్నాడు.

ప్రకృతి ప్రసాదించిన సిరిసంపదనుచూసి సన్యాసికి ఆశ్చర్యమైంది. సన్యాసి 'ఓ అబ్బాయి, దేవుడు, నువ్వు కలసి ఎంత దిగ్విజయంగా నెరవేర్చారో చూచావా! సర్వశక్తి స్వరూపుడైన దైవాన్ని ఎప్పుడూ మరచిపోవద్దు' అన్నాడు. యువకుడు పండితుడుకాకపోయినా సన్యాసికి వంగి నమస్కరించి 'మహాప్రభో! నాకేమీ తెలియదు. నేను ఒక జ్ఞానంలేని పరమ మూర్ఖుణ్ణి. నాకు దేవుడు ఎవరో తెలియదు. దేవుడు అనేవాడు ఈవిశ్వంలో ఉంటే ఉండ వచ్చు. లేకపోవచ్చు. మిమ్ములనే పూర్తిగా నమ్ముకున్నాను మీ రూపంలో దేవుడు ఇక్కడ ఈక్షేత్రంలో ఉండి ఉండవచ్చు. అయితే నాకు ఒక్కటిమాత్రం తెలుసు' అని కరుణా రసమూర్తి అయిన సన్యాసి గంభీరమైన ముఖాన్ని భక్తితో చూడడం ప్రారంభించాడు.

సన్యాసి చిరునవ్వుతో అదేమిటి అని అడిగాడు. యువకుడు 'నాకు దేవుడంటే ఏం తెలియదు. అయినా మీరు చెప్పినది పూర్తిగా విశ్వసిస్తా. దేవుడు ఒక్కడూ ఉన్నప్పుడు మీరు ఈ ప్రదేశాన్ని చూచి ఉండవచ్చు' అన్నాడు. వివేకయుక్తమైన ఈ మాటలు విని సన్యాసి మాట్లాడకుండా మౌనంతో నిష్క్రమించాడు.

దేవుడు ప్రతీచోటా ఉంటాడు. కానీ మానవుడు ఉద్యమిస్తేగాని విజయం సాధించలేడు. స్వప్రయత్నంతో ఉద్యమించే సాధకులకు సర్వాంతర్యామి అయిన ఈశ్వరుడు సాక్షాత్కరిస్తాడు. వృధా కాలక్షేపం చేసే సోమరులకు విచారం, దుఃఖం మిగులుతాయి.

—స్వామీ చిన్మయానంద

## ఇమిడికగా ఉండే టెలిఫోన్ విశ్లేషిణి

ఇంతకు ముందు టెలిఫోన్‌లో సంభాషణ రహస్యం కాపాడటానికి తగిన సరంజామా చాలా పెద్దది. ఉపయోగానికి మిక్కిలి సంకీర్ణమైనది. కానీ ఇప్పుడు వచ్చే టెలిఫోన్ విశ్లేషిణి అరచేతిలో ఇముడ్చుకో వచ్చు. ఇది న్యూయార్క్ (యుఎస్ఏ) సి.సి.ఎస్ కమ్యూనికేషన్ కంట్రోల్ ఇన్‌కార్పొరేటెడ్ వారిచే తయారుచేయబడింది. ఈ సాధనం హోటళ్లలో, ఆఫీసులలో, కారులలో ఇంకా ఇతరత్రా తెలియకుండా ఉంచిన బగ్స్‌ను (Bugs) ను, వైర్ టేప్స్‌ను (Wiretapes) ను, టేప్ రికార్డులను తెలియజేస్తుంది. తెరమీద అంకెలు వోల్టేజీలో ఎలక్ట్రికల్ కరెంట్‌లో, పౌనఃపున్యంలో మార్పులను తెలియజేస్తుంది. దీనివల్ల వినికిడి సాధనాల ఉనికి మనకు తెలుస్తుంది.

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1. ప్రపంచంలో ప్రఖ్యాతి పొందిన ఏ వార్తాపత్రిక 1985 జనవరి 1న 200 వ ప్రారంభోత్సవ దినం జరుపుకుంది?
2. హేలీ తోకచుక్కను సంధించడానికి ప్రవేశ పెట్టబడిన మొదటి సోవియెట్ ఆటోమాటిక్ స్పేస్‌క్రాఫ్ట్ పేరు ఏమిటి?



3. ప్రపంచంలో బ్రహ్మాండమైన సోలార్ ఫర్నేస్‌ను ఏ దేశం అమర్చింది?

(ఎ) గంగానదీ వరదనీటిని అరికట్టడానికి, (బి) కలకత్తా రేవు మేటవేసి మూసిపోకుండా ఉండడానికి, (సి) గంగ కాలుష్యాన్ని తగ్గించ డానికి, (డి) చేపలను పట్టడానికి సహకరించ డానికి.

5. అంటార్కిటికాలో భారతదేశపు రెండవ సుస్థిరమైన విడిది పేరు ఏమిటి? (ఎ)చక్ర, (బి) శ్వేత, (సి)మైత్రి, (డి) దక్షిణ గంగోత్రి, (ఇ) ఏదీకాదు.
6. పిన్‌కోడ్ నెంబరులో చివరి మూడు సంఖ్యలు దేన్ని సూచిస్తాయి? (ఎ) రీజియన్, (బి) సబ్-రీజియన్, (సి) సార్టింగ్ డిస్ట్రిక్టు, (డి) బ్రాంచి పోస్ట్ ఆఫీసు, (ఇ) డెలివరీ పోస్ట్ ఆఫీసు.
7. ఆకాశంలో మిక్కిలి ఎత్తైన ప్రదేశాలలో అత్యధిక రెన్క్యూ సార్టీల నిర్వహణకు ప్రపంచ రికార్డును స్థాపించిన ఇండియన్ ఎయిర్ ఫోర్స్ పైలట్ ఎవరు?
8. నౌకానిర్మాణానికి ఏ దేశం మిక్కిలి ప్రగతి చెందింది? (ఎ) నార్వే (బి) ఫిన్‌లాండ్, (సి)ది నెదర్‌లాండ్స్ (డి)జపాన్.

## తన డానికి ప్రతివారికి హక్కు ఉంది

ఒకసారి లాయడ్ జార్జి ఐర్లాండ్‌కి హోమ్ రూల్‌ను గురించి మాట్లాడుతూ స్వయం నిర్ణయం మరియు హోమ్ రూల్‌ను వివరించాడు. సభ్యులలో ఒక విమర్శకుడు లేచి 'ఈ దేశానికి హోమ్ రూల్, ఐర్లాండుకు హోమ్ రూల్, నరకానికి హోమ్ రూల్' అని గట్టిగా అరిచాడు. లాయడ్ జార్జి 'ఔనండీ! తన మాతృ దేశాన్ని గురించి మాట్లాడడానికి ప్రతీవారికి హక్కు ఉంది' అని జవాబు చెప్పాడు.

### బంగాళాదుంప అధికంగా తింటారు

ప్రతి ఐరిష్ దేశస్థుడు సగటున రోజుకి 500 గ్రాముల బంగాళాదుంప తింటాడు. ప్రపంచంలో అత్యధికంగా బంగాళాదుంప తినేవారు ఐర్లాండ్ దేశీయులు.

"ఎవరి తప్పులు వారు తెలుసుకోవడం వివేకం."

## తెలివికి పరీక్ష

1. ఈ వరుసలో తరువాతి సంఖ్య ఏది?
   88 17 87 16 86 15 85 -?
2. ప్రారంభమయ్యే అక్షరం, అంతమయ్యే అక్షరం ఒకటిగా ఉండి ఆసియాకి దక్షిణ దిక్కుకు దూరంగా ఉన్న దేశం ఏది?
3. సంవత్సరంలో ఎన్ని నెలలకు 28 రోజులు ఉంటాయి?
4. ఉపనిషత్తుల నిగ్గు భగవద్గీతలో ఉంటే పురాణాల నిగ్గు ఎందులో ఉంది?
5. మనం వర్తమానంలో జీవించాలి. ఎందుకు?
6. ఒకరు ఇంకొకరి డబ్బును ఎప్పుడు దిగమ్రింగుతారు?

## మాటల మహిమ

1. నిగ్గు: కాంతి (ఎ), జిడ్డు (బి), కిరణము (సి), సారము (డి).
2. నులి: మెలిక(ఎ), అల్పము (బి), చిక్కు (సి), బాధ (డి).
3. దొసగు: కష్టము (ఎ), అపకారము (బి), తప్పు (సి), సంబంధము (డి).
4. వైనము: వివరము(ఎ), ఉపాయము (బి), క్రమము(సి), తపసీలు(డి).
5. విడుత: పర్యాయము (ఎ), తడవ (బి), విమోచనము (సి), త్యాగము (డి).
6. వెండి: రజతము (ఎ), పిమ్మట (బి), వేడుక (సి), కుతూహలము (డి).
7. వ్యవహారము: ప్రవర్తన (ఎ), పని (బి), వ్యాపారము (సి), వాడుక (డి).
8. వాడ: వీధి (ఎ), ఇండ్లవాడ (బి), పంక్తి (సి), పరిమాణము (డి).

(జవాబులకు వ పేజీ చూడండి)

## 1908 ఒలింపిక్ క్రీడలలో ఆర్చరీ చేర్చబడింది



*ప్రాచీనకాలంలో వేటలలోను, యుద్ధాలలోను విల్లు అమ్ములు ఉపయోగించేవారు. ప్రసిద్ధి పొందిన నాయకులు విల్లు అమ్ములతో గొప్పగొప్ప అద్భుతాలను ప్రదర్శించేవారు. రాతియుగపు కాలంలో గుహలలో నివసించేవారికి విల్లు అమ్ములతో సూటిగా గురితప్పకుండా కొట్టే తంత్రం బాగా తెలుసు. చెకుముకిరాయి తగిలించిన మొనగల అమ్ములు 25,000 సంవత్సరాలకు పూర్వం ఉపయోగించేవారు.*

*నేడు భారతదేశం అడవులలో నివసించే గిరిజనులు వేటకు అమ్ములను ఉపయోగిస్తున్నారు. హిమాలయ సామ్రాజ్యంలో భూటాన్‌లో ఆర్చెరీ ఒక జాతీయ క్రీడ. మేఘాలయాలో ప్రజలు ఆర్చెరీలో ప్రావీణ్యం సాధించారు. వీరు ఒక్క నిమిషంలో వరుసగా 20 బాణాలు వదలగల నిపుణులు. యూరప్‌లో మోడరన్ ఆర్చెరీని ఒక క్రీడగా స్థిరపరచారు. కానీ ఇంతకు ముందే ప్రపంచంలో అనేక రాజ వంశాలలో ఆర్చెరీ ఉత్సాహవంతమైన క్రీడగా ఉండేది. 1908 లో లండన్ నగరంలో నిర్వహించబడిన ఒలింపిక్ క్రీడలలో ఆర్చెరీని కూడా చేర్చారు.*

"పరమాత్మభావన హృదయంలో వెలిగే అఖండజ్యోతి, ఎప్పుడూ ఆరకుండా చూచుకోవాలి." -రాజాజీ

# వెదర్ సాటిలైట్స్

జిమ్ ఫుల్లర్

మూడు దశాబ్దాల నుంచీ వెదర్ సాటిలైట్స్ (వాతావరణ ఉపగ్రహాలు) సంగ్రహిస్తున్న పర్యావరణ వివరాలు విశ్వవ్యాప్తంగా శీతోష్ణ స్థితి గతులలో ఏర్పడుతూన్న వివిధ మార్పుల అధ్యయానికి పరిశోధకులకు ఉపయోగపడుతున్నాయి.



1960 ఏప్రిల్ 1న ప్రపంచంలో మొట్టమొదట ఫ్లోరిడాలో కన్నెడీ స్పేస్ సెంటర్ నుంచి ప్రవేశ పెట్టబడిన వెదర్ సాటిలైట్‌తో టెలివిజన్ ఇన్‌ఫ్రారెడ్ అబ్జర్వేషన్ సాటిలైట్ TIROS కార్యక్రమం ప్రారంభమైంది.

ప్రస్తుతం క్రిందగా ధృవ కక్ష్యలలోను 35,680 కి.మీల ఎత్తుగా భూస్థిర కక్ష్యలలోను ప్రయాణం చేస్తూన్న TIROS అంతరిక్షనౌకలు దైనందిన వాతావరణ సూచక చిత్రాలను అందిస్తాయి. అంతేగాక సముద్రతల ఉష్ణోగ్రతలను, హిమ మరియు మంచు ఆచ్ఛాదమ్ము, ఓజోన్ క్షయకరణ, వృక్షసంపద, మేఘాచ్ఛాదమ్ము, ప్రెసిపిటేషన్, అగ్నిపర్వత విస్ఫోటనం, అడవులలో మంటలు, కొట్టివేయబడుతూన్న అడవులు మొదలైన వివరాలను కూడా తెలియజేస్తున్నాయి.

ఇటీవల వెదర్ సాటిలైట్స్ ఇచ్చిన వివరాల పరిశోధనల ఫలితంగా 1 979 నుండి 1988 వరకు గత 10 సంవత్సరాల కాలంలో విశ్వవ్యాప్తంగా ఉష్ణోగ్రత పెరగలేదని తెలుసుకున్నారు. భూతలంపైన వాతావరణం వేడెక్కుటవల్ల కలిగే మైక్రోవేవ్ రేడియేషన్‌ను కొలిచే సాధనాలు ఉపగ్రహాలలో ఏర్పాటు చేయబడ్డాయి. ధృవ వలయం కక్ష్యలో తిరుగుతూన్న ఉపగ్రహాలలో ఏర్పాటైన ఈ సాధనలు ఇచ్చిన వివరాలను శాస్త్రజ్ఞులు వినియోగించుకుంటున్నారు.

1982 నుండి భూతలం మీద వృక్ష సంపదను కూడా వెదర్ సాటిలైట్స్ కనిపెడుతున్నాయి. దక్షిణ అమెరికా అమెజాన్‌లో పుష్కలమైన సస్య సంపదను ముదురు ఆకుపచ్చరంగులో ప్రదర్శించింది. ఉత్తర ఆఫ్రికా సహారా ఎడారి మీదుగా వృక్షసంపద లేని ప్రదేశాన్ని నల్లగా చూపించింది.

## విజయానికి తలుపులు

*విజయానికి తలుపులు పూర్తిగా తెరవబడి ఉండవు.*
*ప్రవేశించడానికి ముందు చావడి క్రిక్కిరిసిపోయి ఉంటుంది.*
*కొంతమంది ఒక తలుపు లోపలకు తోసుకుని ప్రవేశిస్తారు.*
*మరి.కొంతమంది ఒక తలుపు ముందుకు లాగి ప్రవేశిస్తారు.*

"హృదయానందాన్ని పొందలేనివాడే దరిద్రుడు. ధనహీనుడు కాదు." -స్వామీ చిన్మయానంద

ఉపరి వాతావరణంలో ఓజోన్ ప్రమాణాన్ని తెలుసుకునే వెదర్ సాటిలైట్స్ అంటార్కిటిక్ ప్రదేశంలో ప్రతీ సంవత్సరం ఏర్పడే 'ఓజోన్ హోల్' (Ozone Hole) పరిమాణాన్ని కనిపెట్టి చూపుతుంది. 1985లో తెలుసుకోబడిన ఈ మంచు ప్రదేశంలో ఓజోన్ పొరలో ఏర్పడిన పెద్ద రంధ్రం వల్ల సున్నితమైన వాతావరణ పరిస్థితులకు మానవ నిర్మితమైన రసాయనిక కాలుష్యాల వల్ల భంగం కలుగుతూందని నిశ్చయింపబడింది.

1960 లో మొట్టమొదటి సాటిలైట్‌ను ప్రవేశింప జేసిన తరువాత నాలుగు తరాల వెదర్ సాటిలైట్స్ ఒకదానికంటే ఒకటి వెనుకటి వాటికంటే వినూత్నమై రూపొందాయి. మొత్తం 32 సాటిలైట్స్ విజయవంతంగా ప్రవేశింప బడ్డాయి. ఇవన్నీ వాటి వాటి కార్యక్రమాలను సక్రమంగా నిర్వర్తించి లక్ష్యాలను పొందాయి. మానవ ప్రమేయం లేని అంతరిక్ష క్రమావళిలో ఇది ఇంతవరకు కనీ వినీ ఎరుగని రికార్డు.

ఈ సాటిలైట్స్ ఇచ్చే వివరాల సహాయంతో ప్రపంచం అంతటా మీటియెరొలాజిస్టులు (వాతావరణ శాస్త్రజ్ఞులు) మూడు మొదలు అయిదు రోజుల వాతావరణ పరిస్థితులను ముందుగానే చెప్పగలుగుతున్నారు. 1983 నుండి అంతరిక్ష నౌకలు కమ్యూనికేషన్స్ పాకేజీని కూడా తీసుకు వెళ్లాయి. ఇవి ముఖ్యంగా అపాయంలో చిక్కుకు పోయిన వాయు విమానాల నుంచి, సముద్రపు ఓడల నుంచి వచ్చే అపాయ (Distress) చిహ్నాలను గ్రహించి వాటియొక్క ఉనికి, వివరాలను అయిదు దేశాలలో గ్రౌండ్ స్టేషనులకు తెలియజేస్తాయి.

-'యునైటెడ్ స్టేట్స్ ఇన్ఫర్మేషన్ సర్వీస్' సౌజన్యంతో

# 1939 నుండి ఆహార విజ్ఞానంలో కలిగిన సరిక్రొత్త మార్పులు



** పరిశుద్ధమైన పాకింగ్ టెక్నాలజీ, ప్రతీ రోజూ సరాసరి 100 మిలియను పరిశుద్ధమైన పాకేజీలు ప్రపంచం అంతా టెట్రాపాక్ మెషీనులు తయారు చేస్తున్నాయి.*

** మినిమమ్ సేఫ్ కానింగ్ విధానాలు*

** ఇంటి వంటలో విప్లవం తెచ్చిపెట్టిన మైక్రోవేవ్ ఓవెన్.*

** గట్టిపరచిన సాంద్రీకృత సిట్రస్ ఫలాల రసాలు.*

** తాజాపళ్లకు, కాయగూరలకు నియంత్రిత వాతావరణ పాకేజింగ్.*

** ఫ్రీజ్ డ్రయింగ్.*

** గట్టి పరచబడిన ఆహార పదార్థాలు.*

** అధికంగా ఉష్ణోగ్రత/తక్కువ కాలవ్యవధిలో పాల స్టెరిలైజేషన్ మరియు ఇతర పదార్థాలు.*

** ఆస్పర్టామ్ - ప్రపంచంలో మానవుడు తయారు చేసిన తక్కువ కేలొరీ విలువలతో కూడిన తీపి పదార్థం. దీనిని 79 దేశాలు ఆమోదించాయి.*

*—'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో*

"మానవుని కోసమే శాసనాలు కానీ, శాసనాలకోసం మానవుడు కాదు."

# భారతరత్న విశ్వేశ్వరయ్య సూక్తులు

* జీవితంలో విజయం ప్రయత్నం మీద ఆధారపడి ఉంటుంది. అంటే నీ ఉద్యమం మీదే గానీ, మానసిక భావం మీద కాదు. ఉద్యమ ఫలితమే విజయం.

* జీవితంలో కష్టపడకుండా సుఖపడాలనే ఆశయం కలవారికి ఆకాక్షించిన విజయం


Dr. M. Visvesvaraya

పునాదులు సుస్థిరంగా ఉండవు. అర్హతగల విజయం సిద్ధించదు.

* నీకు పాండిత్యం, ప్రావీణ్యత లేని విషయాలను గురించి నీ అభిప్రాయాలు చెప్పకు.

* నీవు ధరించే బట్టల తీరు నీ నియమాన్నీ నిష్ఠను తెలియజేస్తుంది.

* జీవితంలో మానవుని విజయం శ్రమపై ఆధారపడి ఉంటుంది.

* జీవితంలో పొదుపును అభ్యసించు. సంవత్సరంలో ఒక నెలజీతం ఆదాచేయి.

* జీవితంలో ఆశయం లేకపోతే ప్రగతి కుంటుపడుతుంది.

* శ్రమకు ఓర్చి పనిచేయి. శ్రమకు ఓర్చి పనిచేయడం వల్ల మరణం శీఘ్రంగా రాదు. మానసిక చింతవల్లే మరణం సంభవిస్తుంది.

* కృషి చేయడం ప్రార్థన. మానవుని విద్య మరియు విజ్ఞానం యొక్క ముఖ్య ఆశయం దేశసేవ.

* ఉత్తమ దేశ నిర్మాణం అంటే ప్రజలను ఉత్తమంగా తీర్చి దిద్దడం.

* అన్ని ఉద్యోగాలకు, పరిశ్రమలకు విద్య అవసరమని నాగరిక దేశాలన్నీ కనుగొన్నాయి. పెరిగిన విద్య విజ్ఞానం ప్రమాణాలను పరిశ్రమలకు వినియోగిస్తే ధనాభివృద్ధి కలుగుతుంది.

* పారిశ్రామికాభివృద్ధి లేకపోతే పురోగతి ఉండదు.

* మనచుట్టూ ఉన్నవారు సౌఖ్యంగా ఉంటే మనం సుఖంగా ఉంటామనే ఆర్థిక సత్యాన్ని తరచు మరచిపోతూంటాము.

* దిగుమతులను నిరుత్సాహపరచు, ఎగుమతులను ప్రోత్సహించు.

* విద్య ఆర్థిక సంక్షోభానివారిణి.

* జీవిత పోరాటంలో విద్యార్థులకు క్రమ శిక్షణ ఇవ్వడమే విద్య యొక్క ముఖ్య ఆశయం.

* దేశాభివృద్ధే ధ్యేయంగా ఉండాలి. నీ శక్తికొలది దేశ సామర్థ్యాన్ని ప్రవృద్ధి పరచు.

సేకరణ - కె.వి.రంగనాథాచార్

## 50 అడుగుల లిమోసిన్!

పశ్చిమ యునైటెడ్‌స్టేట్స్ కాలిఫోర్నియాలో ఒక తయారీదారుడు 50 అడుగుల లిమోసిన్ (మూయబడిన మోటారుకారు) - 12 అడుగుల స్విమ్మింగ్ పూల్, చేపల చెరువులు, మైక్రోవేవ్ ఓవెన్, నాలుగు టెలిఫోనులు మరియు ఫ్రిడ్జ్ మొదలైన సౌకర్యాలతో తయారు చేసాడు.

"ప్రభుత్వం ప్రజలకు సేవ చేయడానికే కానీ అధికారం చలాయించడానికి కాదు."

# నవభారత నిర్మాతలు

## జెమ్‌షెడ్జీ నుస్సెర్‌వాంజీ టాటా

టాటా ఇండస్ట్రియల్ హౌస్ స్థాపించిన మహనీయుడు జెమ్‌షెడ్జీ నుస్సెర్‌వాంజీ టాటా. ఇతడు 1839 లో గుజరాత్‌లో నవసారి గ్రామంలో పార్శీ మతానికి చెందిన ఒక నిరుపేద పురోహిత కుటుంబంలో జన్మించాడు. ప్రాచీన సాంప్రదాయక పద్ధతిలో ప్రాథమిక విద్య



JAMSHEDJI TATA

ముగిసిన తరువాత ఇతడు బొంబాయిలో ఎల్ఫిన్‌స్టోన్ కాలేజీలో విద్యను కొనసాగించాడు.

కాలేజీ విద్య ముగిసిన వెంటనే యువకుడైన టాటా చైనాలో నల్లమందు మరియు నూలు వ్యాపారం కొనసాగిస్తూన్న ఒక సంస్థలో ఉద్యోగానికి చేరాడు. వ్యాపార సంబంధమైన సాంకేతిక రహస్యాల ప్రమాణాలకు తగిన శిక్షణ కోసం ఇతడు (దూరప్రాచ్యం) హాంగ్‌కాంగ్‌కు పంపబడ్డాడు. వ్యాపార విజ్ఞానంలో నైపుణ్యం సంపాదించాడు. ఇతడు 1863 లో బొంబాయికి తిరిగి వచ్చి ప్రత్తి వ్యాపారం కొనసాగిస్తూ బాగా ధనం సంపాదించాడు.

ఆ తరువాత ఇతడికి ప్రత్తి వ్యాపారాభిలాష అధికమైంది. బ్రిటన్‌లో లివర్ పూల్‌కు వెళ్ళి అక్కడ భారతదేశపు ప్రత్తి దిగుమతులను పర్యవేక్షిస్తూండేవాడు. ఆధునిక వైజ్ఞానిక రంగంలో మంచి అనుభవం సంపాదించాడు. ధరలు తగ్గిపోవడంతో ప్రత్తి వ్యాపారం పడిపోయింది. దీని ఫలితంగా టాటా సంస్థకు అపార నష్టం కలిగింది. టాటా బ్రిటనులో తమ సంస్థను మూసి బొంబాయికి తిరిగి వచ్చి నూతన జీవితాన్ని ప్రారంభించాడు.

అదృష్టవశాత్తు టాటాకి ఆఫ్రికాలో సంభవించిన అబిసీనియా (Abyssinia) యుద్ధం అనుకూలించింది. జీవితంలో తిరిగి లేవగలిగాడు. బ్రిటిష సైనికులకు సప్లై కాంట్రాక్టును చేపట్టాడు. త్వరలోనే మంచి లాభాలు గడించాడు. ఈ సమయంలోనే ఇతడికి బట్టల వ్యాపారం కొనసాగించాలనే అభిలాష అధికమైంది. భారతదేశంలో నూలు మిల్లులు స్థాపించాలనే ఉద్దేశంతో బ్రిటన్‌లో మాంచెస్టర్‌కు వెళ్ళి అందులో కిటుకులను తెలుసుకున్నాడు.

భారతదేశానికి తిరిగి వచ్చి 1877 జనవరి 1న మధ్య భారతదేశంలో నాగ్‌పూర్‌లో ఎంప్రెస్ మిల్లు స్థాపించాడు. నూలు పరిశ్రమలో నూతన విషయాలను తెలుసుకుని భారతదేశంలో తన మిల్లులలో వాటిని ప్రయోగిస్తూండేవాడు. జపాన్‌కు వెళ్లి నూలు వడకడం, నేయడంలో కొత్త విషయాలను నేర్చుకున్నాడు. అక్కడ వ్యవసాయ పరిశ్రమ, బొగ్గు ఖనిజంగా భూమినుండి లభింప చేసుకోవడం మొదలైన విషయాలను తెలుసుకున్నాడు.

"విద్య రెండు విధాలు. జీవనోపాధికి సహకరించేది.
జీవించడానికి సహకరించేది."

కొన్ని సంవత్సరాలు గడిచాయి. టాటా మరికొన్ని నూలు మిల్లులను కొని భారతదేశంలో ప్రముఖ పారిశ్రామిక వేత్తగా ప్రసిద్ధి పొందాడు. తన సంస్థలలో పనిచేసేవారి యొక్క కష్టనష్టాలను గ్రహించేవాడు. అన్నిరీతుల వారి ఉత్సాహాభిలాషలను ప్రోత్సహించేవాడు. మానకుండా సక్రమంగా పనులలోకి వచ్చేవారికి, సమర్థులకు




ప్రత్యేకంగా బహుమానాలను ఏర్పాటు చేసాడు. ప్రతీ సంవత్సరం వార్షిక బోనసులు చెల్లిస్తూండేవాడు. టాటా ప్రవేశ పెట్టిన విధానం బొంబాయిలో వివిధ మిల్లులవారు అనుసరించారు.

టాటా భారతదేశంలో అనాటి ప్రసిద్ధ భారతీయుడుగా ప్రఖ్యాతి పొందాడు. నేటికి కూడా దేశం వీరికి ఎంతో ఋణపడి ఉందంటే సందేహం లేదు. వృద్ధాప్యంలో ఉపకారబుద్ధితో అనేక సహాయక పథకాలను ఏర్పరచాడు పైచదువులను ఆశించే గ్రాడ్యుయేట్లకు అప్పులు ఏర్పరచాడు.

అనేక సంవత్సరాల పాటు దీర్ఘంగా ఆలోచించి దేశానికి, దేశ ప్రజకు ఉపయుక్తంగా ఉండే మూడు సాహసోద్యమాలను ప్రారంభించాడు. దేశంలో గనులనుండి ముడి ఇనుమును తీసి దానిని ఉక్కుగా మార్చుట మొదటి ఉద్యమం. ఇది బీహార్‌లో జెమ్‌షెడ్‌పూర్‌లో టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ అనే భారీ పరిశ్రమగా రూపొందింది. రెండవ ఉద్యమం పశ్చిమ కనుమలలో వ్యర్థమైపోతూన్న వర్షపు నీటిని పరిశ్రమలకు విద్యుచ్ఛక్తిగా ఉపయోగించడం. ఈ నాడు పూనె మరియు బొంబాయి నగరాల మధ్య పెద్ద ఎత్తున విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తున్న టాటా హైడ్రో - ఎలక్ట్రిక్ పవర్ సప్లై కంపెనీగా ఇది ఏర్పడింది. ఇక మూడవ ఉద్యమం ప్రపంచంలో వైజ్ఞానికంగా ప్రగతి పొందిన దేశాలతో సరిసమానంగా భారతదేశంలో వైజ్ఞానిక పరిశోధక సంస్థ (Scientific Research Institute) స్థాపించడం. కర్ణాటకాలో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ 1911 లో ప్రారంభింపబడింది. ఈ సంస్థ నిర్మాణానికి టాటా రూ. 30,00,000 లు విరాళం ఇచ్చాడు. ఇతర ఖర్చులకు మరి కొంత ధనం కేటాయించాడు.

జెమ్‌షెడ్జీ నుస్సెర్‌వాంజీ టాటా నవభారత నిర్మాతలలో ఒకడు. ధనలక్ష్మి వరించిన గొప్ప ధనవంతుడు. అయినా మాతృదేశాభిమానంతో ఆ మరణాంతం సామాన్యజీవితాన్ని గడిపిన నిగర్వి గొప్ప పారిశ్రామికవేత్త. తనధనాన్నంతా భారత ప్రజల ఆర్థికాభివృద్ధికి వ్యయం చేసాడు. వైజ్ఞానికంగా, సాంకేతికంగా దేశ పారిశ్రామిక ప్రగతికి తోడ్పడ్డాడు.

జెమ్‌షెడ్జీ నుస్సెర్‌వాంజీ టాటా 1904 లో జర్మనీలో బాడ్ నౌహీమ్ (Bad Nauheim)లో మరణించాడు.

## మెక్సికన్ మరుగుజ్జులు

*లూసియా జారేట్ (1863-1889) మెక్సికన్ మరుగుజ్జులు (Mexican Midgets) అయిన చెల్లెళ్లలో ఒకర్తి. 15 సంవత్సరాల వయస్సులో వీరు సర్కస్సులో నటించినప్పుడు ఈమె 20 అంగుళాలు ఎత్తుగా ఉండి, 5 పౌండ్లు బరువు తూగింది.*

"లోభిదగ్గర ఉన్న నాణాలు విలువలేని గులకరాళ్లు."

# సులభంగా బాధపడిపోతారా?

నీకు సులభంగా సంవేదన కలుగుతుందా? ఎదురు చూస్తున్న టెలిఫోన్‌కాల్ రాలేదా? నీ పుట్టిన రోజు ఎవరైనా మరచిపోయారా? నిన్ను పిలవలేదా? నీతో చెప్పలేదా?

ప్రతీవారికి 'అహం' అనేది అప్పుడప్పుడు విజృంభిస్తుంది. ఇది సహజం. అసలు



విషయం మానసికంగా కలిగిన గాయాన్ని ఎలా తట్టుకోగలరు అన్నదే. జీవితంలో సంభవించే నిరాశలు, నిస్పృహలు అన్నీ వ్యక్తిగతంగా శీలాన్ని, సౌందర్యాన్ని అభివృద్ధి చేసుకోడానికి సహకరిస్తాయి

ప్రతీసారి ఆత్మానుతాపం కలుగకుండా నిరోధించుకోగలిగితే నీ వ్యక్తిత్వం ఎంతో పెరుగుతుంది. ప్రతీదానికి చిరచిరలాడటం, విసుక్కోడం మానుకుంటే వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేసుకుంటావు. పరిస్థితులకు లొంగిపోకుండా మనోనిబ్బరంతో ధైర్యంగా ప్రవర్తిస్తే ఇతరుల గౌరవ మర్యాదలను సులభంగా పొందగలుగుతావు.

కొన్నికొన్ని అత్యవసర పరిస్థితులలో నోరు తెరవకు, మూసుకుని ఉండు. సహజంగా నీకు నిరాశ కలిగించిన వ్యక్తి మీదికి ఎగిరిపడి చివాట్లు పెడదామనే భావం మనసులో రాకుండా నిరోధించుకో.

గాయపడిన నీ మనోభావాలను ప్రదర్శించడానికి ప్రయత్నించకు. ఏకాంతంగా ఉన్నప్పుడు లాభం లేకపోయినా స్మరించుకో. చిట్టచివరగా నిశ్చయించుకో. ఇటువంటి దుఃఖాన్ని ఇంకొకరికి ఎప్పుడూ కలిగించకు. శాయశక్తులా ప్రయత్నించు.

-'ది లిటిల్ గెజెట్' సౌజన్యంతో

## కాలం ఒక బాంక్ వంటిది

ఒకబాంక్ ప్రతీరోజూ ఉదయం నీఖాతాకి రూ. 86,400 జమకట్టి ప్రతీసాయంత్రం నీవు ఉపయోగించుకోకుండా ఉండిపోయిన సొమ్మును ఖర్చు వ్రాసేస్తూంటే నీవు ఏం చేస్తావు? ప్రతీ పైసా ఎప్పటికప్పుడు తీసేసుకుంటావు.

అలాగే టైము అటువంటి బాంకు. ప్రతీరోజు ఉదయం నీకు 86,400 సెకండ్ల కాలాన్ని జమ చేస్తుంది. నీవశం చేసిన ఈకాలంలో నీవు ఉపయోగించుకోకుండా వ్యర్థంచేసినకాలం రాత్రి చెల్లిపోయి నష్టే. ముందు ఖాతాలోకి ఏం జమ అవదు. ఓవర్ డ్రాఫ్టులు ఉండవు. ఏరోజుకారోజే క్రొత్త ఖాతా ప్రారంభం. ఉదయం జమైన దాన్ని ఉపయోగించుకోకపోతే నీదేనష్టం. వెనుకకు వెళ్ళడం అంటూ ఉండదు. రేపటి దానిమీద తీసుకోడం ఉండదు. వర్తమానంలో జీవిస్తూ ఏరోజు జమను ఆరోజు సక్రమంగా, ఆరోగ్యవంతంగా, లాభదాయకంగా వినియోగించుకోవాలి.

"మనస్ఫూర్తిగా చేసేపనులు అన్నీ అతిసులభంగా నెరవేరతాయి."

# బ్రహ్మచారుల సంఘం

వెర్రికి వేయివిధాలు. పాశ్చాత్య దేశాలలో చిత్ర విచిత్ర సంఘాలు ఎన్నో బయలుదేరాయి. ల్ఫ్రాకొంబేలో (Llfracombe) లో బ్రహ్మచారుల క్లబ్ ఒకటి అటువంటిదే. ఈ క్లబ్ మొదటి నిబంధన సభ్యులలో ఎవరైనా అమ్మాయిలతో మాట్లాడితే అతడికి జరిమానా విధించాలని



నిర్ణయించింది. విధించబడే జరిమానా సామాన్యంగా అమ్మాయి సొగసు, సౌందర్యానికి తగినట్టుగా ఉంటుంది. ఈ విధంగా పోగైన సొమ్ము స్థానికంగా ఉదారవంతమైన పరోపకార సంఘాలకు ముట్టజెప్పడం ఇంకా వింతగా, ఆశ్చర్యంగా కనిపిస్తుంది.

బిల్లింగ్స్‌గేట్ దగ్గర స్థాపించబడిన ది సర్లీ (Surly) క్లబ్‌లో సభ్యులు ముఖం ముడుచుకుని ఉండాలి. ముఖం మీద నవ్వు కనిపిస్తే నేరం. అంతేకాదు సభ్యులు అందరూ అనాగరికమైన స్థానిక భాషలోనే పరస్పరం మాట్లాడుకోవాలి కానీ నాగరిక భాషలో మాట్లాడుకోరాదు.

కండ బాగా బలిసిన వారికి పూర్వం లండన్‌లో ప్రసిద్ధి చెందిన కార్పులెంట్ (Corpulent) క్లబ్ ఒకటి ఉండేది. అసలు ఈ క్లబ్‌లోకి ప్రవేశం అసాధ్యం. ఇక సభ్యులను కలుసుకోవడం మరీ అసంభవం.

ఈ కార్పులెంట్ క్లబ్ గదికి రెండు ప్రవేశ మార్గాల ద్వారం ఉంది. ఒకటి మధ్యరకపు పరిమాణంలో ఉండేవారికి. రెండవది లావుపాటి వారికి. దీనికి రెండు మడత తలుపులు అమర్చబడి ఉంటాయి. సభ్యులుగా చేరేవారు మొట్టమొదట గేటుగుండా ప్రవేశించాలి. ఏ కష్టం లేకుండా లోపలకు ప్రవేశించగలిగితే వారికి అర్హత లేదు. గౌరవమర్యాదలు దక్కవు. అలా కాకుండా అటు వెళ్లడానికిగానీ, ఇటు రావడానికిగానీ వీలులేకుండా ద్వారంలో మధ్య చిక్కుకుపోతే మడత తలుపులు పూర్తిగా తెరవబడతాయి. లోపలికి గౌరవ మర్యాదలతో ఆహ్వానింపబడతాడు.

## యౌవ్వనం నిలబెట్టుకోడానికి చురుకుదనం ముఖ్యం

*సోమరిగా జీవిస్తూ సుఖ సౌభాగ్యాలతో దీర్ఘకాలం జీవించడానికి ఎవరికీ హక్కు లేదు. సముద్రంలో ప్రయాణం చేసే ఓడ కంటే రేవులో లంగరు వేసి ఉంచిన ఓడ త్వరగా చీకి చివికిపోతుంది. ప్రవహించే నీటికంటే నిశ్చలంగా చెరువులో ఉండే నీరు అతి శీఘ్రంగా పాచిపడుతుంది. చురుకుగా పనిచేసే బుద్ధిమంతుల మనసులకంటే వ్యర్థకాలక్షేపం చేసేవారి మనస్సులు శీఘ్రంగా క్షీణించిపోతాయి. మన మెదడులో వినియోగించుకోని కణాలు వినియోగించుకునే కణాలకంటే అతిశీఘ్రంగా నశించిపోతాయి. కాబట్టి నిత్య యౌవ్వనంలో ఉండాలంటే మనసును చురుకుగా ఉంచుకోవాలి.*

-అమెరికన్ సేల్స్‌మన్

"అధికారం విషతుల్యం. సదసద్వివేకాన్ని నశింపజేస్తుంది. హృదయకాఠిన్యత ఏర్పడుతుంది. అవగాహనాశక్తిని వినాశం చేస్తుంది."

హమ్‌డ్రమ్ (Humdrum) క్లబ్, మమ్ (Mum) క్లబ్‌లు కూడా ఇటువంటివే. ఇక్కడ సభ్యులందరూ శాంతంగా ఉండాలి. చుట్టూ కూర్చుని ఏమీ మాట్లాడకూడదు. సిగరెట్లు గొలుసుకట్టుగా కాలుస్తూ అర్థరాత్రి అయేదాకా కూర్చోవాలి. గడియారం 12 గంటలు కొట్టిన వెంటనే అకస్మాత్తుగా అందరూ లేస్తారు. కోట్లు వేసుకుంటారు. గుడ్‌బైలు చెప్పుకుని ఎవరి ఇళ్లకి వాళ్లు పోతారు

వీటి అన్నిటికంటే ఎంతో చిత్రంగా ఉండేది సోదర బృందం (Brothershood). ఇది ఫిలడల్ఫియాలో నివసిస్తూ న్యూయార్క్ నగరంలో పనిచేసే 135 మందితో ప్రారంభమైంది. ప్రతీ రోజూ వీరు వీటి మధ్యదూరం 90 మైళ్లు అటూ ఇటూ రైలు మీద ప్రయాణం చేస్తారు. ఇదే 'సెవన్-ఒ-క్లాకర్స్ క్లబ్' (Seven-O-Klockers Klub). వీళ్లందరూ ఫిలడల్ఫియాలో సరిగ్గా ప్రొద్దున్న 7 గంటలకు బయలుదేరుతారు. తిరిగి సాయంకాలం సరిగ్గా 7 గంటలకు ఇంటికి చేరుకుంటారు. అందుకే దానికి ఆ పేరు వచ్చింది. ఈ క్లబ్ 1927 నుంచి ఉంది. ది ఫిలడల్ఫియా అండ్ రీడింగ్ రెయిల్ రోడ్ కంపెనీకి ఈ 135 సభ్యులంటే ఎంతో గౌరవం, మర్యాద. క్లబ్ సభ్యులు ప్రత్యేకంగా ఉపయోగించుకోడానికి ఈ కంపెనీవారు రెండు కారేజీలు కేటాయించారు. ఒక కారేజీలో సభ్యులు వినోదంగా ఆడుకోడానికి అన్ని రకాల ఇన్‌డోర్ గేమ్స్ ఏర్పాటుచేసారు.

సభ్యులందరూ సరిగ్గా 7 గంటలకు నెక్‌టైలు కట్టుకుంటూ టూత్ పేస్ట్, కాఫీ వాసనలతో 'హలో క్లాకర్!' అంటూ అభినందించుకుంటూ బయలుదేరి వస్తారు. లేకపోతే ఫైను చెల్లించాలి.

అమెరికాలో ఇటువంటి క్లబ్బులకు లెక్క లేదు. అగ్లీ ఫేసెస్ క్లబ్ (కురూపుల సంఘం), ది స్ప్లిట్ ఫార్థింగ్ క్లబ్, హెన్‌పెక్ క్లబ్ (భార్యచేత మొట్టికాయలు తినేవారి సంఘం), బట్టతల వాళ్ల సంఘం - ఇలా ఒకటా రెండా వెర్రికి వేయివిధాలు.

## ఆస్టిరాయిడ్స్



*సౌరకుటుంబంలో చిన్న చిన్న గ్రహాలు ఆస్టిరాయిడ్స్. ఇవి పరిమాణంలో చిన్నవిగా ఉండటంవల్ల దూరదర్శిని గుండా పరిశీలించినప్పుడు కాంతి బిందువులుగా ప్రకాశిస్తాయి. ఆస్టిరాయిడ్ అనే పదానికి నక్షత్రం వంటి (Star - Like) అని అర్థం. చాలా మటుకు ఈ ఆస్టిరాయిడ్ల కక్ష్యలు కుజ మరియు గురుగ్రహాల కక్ష్యల మధ్య ఉంటాయి. ఇటలీలో సిసిలీకి చెందిన గుసెప్పీ పియజ్జీ (Giuseppi Piazzi) 1801లో కనిపెట్టిన సిరిస్ (Ceres) ఆస్టిరాయిడ్లలో మిక్కిలి పెద్దది. దీని వ్యాసం సుమారు 480 మైళ్లు. చంద్రుని వ్యాసంలో నాల్గవవంతు కంటే తక్కువ. ఆస్టిరాయిడ్స్ అన్నిటిలో 1898లో డివిట్ కనిపెట్టిన ఇరాస్ సూర్యగ్రహానికి చాలా దగ్గరగా ఉంటుంది. ఇది భూగ్రహానికి 14 మిలియను మైళ్లు దూరంలో ఉంటుంది. ఇప్పుడు సుమారు 30,000 ఆస్టిరాయిడ్లు ఉన్నాయి.*

'గతించిన కాలానికి ఏ గడియారం గంటలు కొట్టదు.''

# గాలితో విద్యుచ్ఛక్తి

ఆనంద్ పార్థసారధి

భారతదేశంలో ఈ నాడు గాలి సహాయంతో జనింపబడే విద్యుచ్ఛక్తి 30 మెగావాట్లులకు పైగా నేషనల్ గ్రిడ్‌కి చేర్చబడుతూంది. ప్రస్తుత యోజనా ఫలితాంశాలే సరియైనవని అనుకుంటే ఈ శతాబ్దాంతాని (2000 A.D.) కి



గాలి విద్యుచ్ఛక్తి (Wind Power) సామర్థ్యత 3000 MW లకు పైగా అంటే నూరురెట్లు పెరుగుదలను పొందగలుగుతాం.

గాలి సహాయంతో విద్యుదుత్పాదన సాధ్య పడాలంటే వాతావరణంలో గాలి గంటకు 18 కి.మీ.కు పైబడిన వేగంతో జోరుగా వీస్తూండాలి. ఈ పరిస్థితులు ఇప్పుడు తమిళ నాడులోను మరియు గుజరాత్‌లోను చాలా అనుకూలవంతంగా ఉన్నాయి. ఒరిస్సా కర్ణాటకా, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఈశాన్య దిక్కుగా ఉండే రాష్ట్రాలతోబాటు రాజస్థాన్ మరియు ఉత్తరప్రదేశ్ కూడా త్వరలోనే రంగంలోకి ప్రవేశిస్తాయి.

నేడు ఉత్పాదింపబడుతూన్న సరిపోలిస్తే గాలి సహాయంతో ఉత్పాదింప గలిగే విద్యుచ్ఛక్తి చాలా అధికం. నాన్-కన్వెన్షనల్ ఎనర్జీ సోర్సెస్ డిపార్ట్‌మెంట్ ఈ శక్తి 20,000 MW ఉండవచ్చని అంటున్నారు. ఢిల్లీలో టాటా ఎనర్జీ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ వారు ఒక్క భారతదేశపు తీరప్రదేశాలలో మాత్రమే ఈ శక్తి 50,000 MWలను దాటవచ్చు అని అంటున్నారు.

ఒఖా (Okha) విండ్ ఫారమ్‌లో ఉత్పాదింప బడిన ఫలితాల ఆధారంగా చూస్తే గాలితో ఉత్పాదింపబడే విద్యుచ్ఛక్తి యూనిట్‌కు 95 పైసలు - అతి చౌకగా ఉంటుంది.

-'సిఇఇ - ఎన్‌ఎఫ్‌ఎస్' సౌజన్యంతో

# మొట్టమొదటి ఏరియల్

*ప్రఖ్యాత ఫ్రెంచి భూవిజ్ఞాన శాస్త్రవేత్త అరాగో (Arago) సూచనను అనుసరించి సుమారు 1858 లో ఫ్రెంచి సర్వేయర్ లాస్సెడట్ మొట్టమొదటి ఏరియల్ ఫోటోగ్రాఫ్‌ను తీసాడు. మామూలు ప్లేట్ కెమెరాను గాలిపటాలు మరియు బెలూనుల సహాయంతో గాలిలో నిట్టనిలువుగా వ్రేలాడ గట్టాడు. తేలియాడే బెలూనులు, ఎయిరోప్లేనులు ఏరియల్ ఫోటోగ్రాఫీను సాంకేతికతతో ఉపయోగించడం సాలభ్యవంతం చేసాయి. భూమి వక్రతను నిరూపిస్తూ మొట్టమొదటి ఏరియల్ ఫోటోగ్రాఫ్‌ను 1935 లో 72,400 అడుగుల ఎత్తున ప్రయాణం చేస్తూ కాప్టెన్ స్టీవెన్స్ బెలూన్ నుంచి తీసాడు.*

# ఎనిమిది మిలియనుమంది బాల బానిసలు

భారతదేశవు గ్రామాలలో 7 సంవత్సరాల వయస్సుగల చిన్నపిల్లలు నిర్బంధ కూలీలుగా పని చేస్తున్నారు. ఈ పిల్లలు సుమారు 8 మిలియను మంది అందరూ షెడ్యూల్డ్ తర గతులకు, షెడ్యూల్డ్ జాతుల కుటుంబాలకు చెందినవారు.



వారణాశి మరియు మీర్జాపూర్‌లలో పనిచేసే 1,50,000 మంది పిల్లలలో సగానికి సగం మంది తివాసీల నేత పరిశ్రమలలో ఉన్నారు. కాశ్మీర్‌లో నివసించే 72,000 మందికి పైగా బానిసలుగా ఉన్న పిల్లలు మహమ్మదీయ కుటుంబాల నుంచి వచ్చినవారే. తమిళనాడు కాంచీపురంలో 20,000 మంది పిల్లలు నిరంతరం కాంచీపురం పట్టుచీరల ఫాక్టరీలలో పనులు చేస్తున్నారు. శివకాశీలో 50,000 మంది పిల్లలు రోజుకి 10 మొదలు 12 గంటలు ఇక్కడి మాచ్ ఫాక్టరీలలో పని చేస్తున్నారు.

గ్లాస్ మరియు గాజుల పరిశ్రమలలో అనేకమంది పిల్లలు 1300 సెల్షియస్ ఉష్ణో గ్రత కలిగిన కొలుముల దగ్గర పనులు చేస్తూ వంటిచర్మం కాల్చుకుంటూంటారు. జైపూర్ మరియు సూరత్‌లలో వజ్రాలకోత మరియు మెరుగు పరిశ్రమలలో 65,000 మంది పిల్లలు రోజుకి 10 గంటలు పనిచేస్తారు. ఇటుక ఆవలు, రాతి కంకర క్వారీలు, భవన నిర్మాణ పరిశ్రమలు మొదలైన వాటిలో చాలామంది పిల్లలు పని చేస్తున్నారు.

-'హ్యూమన్ రైట్స్ వరల్డ్ వైడ్' సౌజన్యంతో

## నీవు సహకరించుకోవాలంటే ఇంకొకరికి సహకరించాలి

*ఒక మరణించిన వ్యక్తిని యమధర్మరాజు నరకానికి వెడతావా, స్వర్గానికి వెడతావా అని ప్రశ్నించాడు. ఎక్కడికి వెళ్లాలో నిశ్చయించుకోడానికి అవి ఎలా ఉంటాయో చూడాలన్నాడు ఆ వ్యక్తి. యమభటులు మొదట అతడిని నరకానికి తీసుకువెళ్ళారు. అక్కడ ఉన్నవారు భోజనం చేయడానికి పంచభక్ష్య పరమాన్నాలతో వడ్డించి ఉంచారు.*

*వెళ్లిన వ్యక్తికి ఎంతో ఆనందం కలిగింది. తరువాత అతనిని స్వర్గలోకానికి తీసుకువెళ్ళారు. అక్కడా ఇలాగే విస్తళ్ళు వడ్డించి ఉన్నాయి. రెంటికీ వ్యత్యాసం అతనికి గోచరించలేదు. ఒక స్థిర నిర్ణయానికి రాలేకపోయాడు.*

*త్వరగా చెప్పమని తిరిగి నరకంలోకి తీసుకువెళ్లారు. అక్కడ అందరూ చాప్‌స్టిక్కులు పట్టుకుని కూర్చు న్నారు. వాటిని ఎలా ఉపయోగించాలో తెలియలేదు. తిరిగి స్వర్గానికి తీసుకువెళ్ళారు. ఇక్కడ చాప్ స్టిక్కులతో ప్రతీవాడు ఎదుటివాడికి తినిపిస్తున్నాడు. ఈ విధంగా ఎవరికి కావలసింది వారు తింటున్నారు.*

*ఇతరులకు సహాయం చేయాలనే భావం వీరి మనస్సులో కలిగింపజేసారు. ఈ భావం నరకవాసులకు కలిగించలేదు.*

'పనియొక్క విలువను ఫలితాలను బట్టి నిర్ణయించండి. ప్రారంభాలను బట్టి కాదు.''

ఉమా

మాకొద్దీ తెల్ల దొరతనము దేవా'
దండాలండోయ్ మేముండలేమండోయ్ బాబు!
ఉప్పువన్ను పప్పువన్ను ఊరికెళితే పన్ను బాబు'

అనే పాటలు ఆంధ్రదేశమంతా వ్యాప్తి పొంది మన్ననలను పొంది చిరస్థాయిగా నిలిచాయి. జాతీయోద్యమంలో పాల్గొన్నందుకు కఠిన కారాగార శిక్షను అనుభవించాడు. 'కురళ్' తమిళ గ్రంథాన్ని తెలుగుచేసాడు. అనేక ఇతర గ్రంథాలు కూడా రచించాడు.

* * *

(మిగతా 45·వ పేజీలో)

## కొందరు రచయితలు - వారి గ్రంథాలు


THOMAS CARLYLE

ఆర్థర్ హేలీ ... ఎయిర్‌పోర్ట్
ఒ. వుల్లారెడ్డి ... ఆటమ్ లీవ్స్
క్వాజా అహమ్మద్ అబ్బాస్ ... బ్రెడ్, బ్యూటీ అండ్ రెవెల్యూషన్
జె.జె. రూసో ... కన్‌ఫెషన్స్
థామస్ కార్లయిల్ ... ఫ్రెంచి రెవల్యూషన్
హెరాల్డ్ జోసెఫ్ లాస్కి ... గ్రామర్ ఆఫ్ పాలిటిక్స్

శ్రీబాపు: వీరి అసలు పేరు సత్తిరాజు లక్ష్మీ నారాయణ. జననం పశ్చిమ గోదావరి జిల్లా. తెలుగు సినీమాకు విదేశాలలో కూడా గౌరవ ప్రతిష్ఠలు తెచ్చిన ప్రముఖ చిత్ర దర్శకులు. చలన చిత్రాన్ని సృజనాత్మకంగా అభివృద్ధి పరచడానికి దేశంలో కృషి చేసిన కొద్దిమంది వ్యక్తులలో ఒకరు. గొప్ప చిత్రకారుడుగా ఖ్యాతి గడించిన 'బాపు' బి.కామ్, బి.ఎల్. పూర్తిచేసి జర్నలిస్టుగా, వ్యంగ్య చిత్రకారుడుగా పేరు పొంది మద్రాసులో అనేక అడ్వర్టైజ్‌మెంట్ కంపెనీలకు ఆర్ట్ డైరక్టరుగా ఉండేవారు. బంగారు పిచ్చుక, బాలరాజు కథ, బుద్ధి మంతుడు, అందాల రాముడు, సంపూర్ణ రామాయణం, ముత్యాల ముగ్గు, సీతాకల్యాణం, గోరంతదీపం, ఇంటి గౌరవం, మనవూరి పాండవులు మొదలైన అనేక తెలుగు మరియు హిందీ చిత్రాలకు దర్శకత్వం వహించారు. వీరి ఐతిహాసిక చిత్రం 'సీతాకల్యాణం' లండన్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో ప్రదర్శింపబడింది. వీరు దర్శకులుగా, ముళ్ళపూడి రచయితగా సృష్టించిన చిత్రానికి 1986 రఘుపతి వెంకయ్య అవార్డు లభించింది. 1990 జూలైలో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు 'కళాప్రపూర్ణ' బిరుదును ఇచ్చి సత్కరించారు.

గరిమెళ్ళ సత్యనారాయణ (1893-1952): స్వాతంత్ర్య సమర సమయంలో తెలుగు దేశంలో ఆంధ్రులను ఉత్తేజపరచిన జాతీయ గేయకవి, స్వార్థత్యాగి. జాతీయోద్యమ ప్రచారంలో తన పాటలను తానే స్వయంగా పాడి వాటి వ్యాప్తికి పాటుపడ్డారు.

"వేదాంత గ్రంథాలెన్ని చదివినా అవి చెప్పేది ఒక్కటే సత్యం. నీలో నీ ఆత్మను తెలుసుకోమని."

# నాటి నుంచి నేటిదాకా తెలుగు సాహిత్యం

సీతారవిచంద్రన్

తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాష. మొత్తం 20కి పైగా భాషలు గల ద్రావిడ భాష దక్షిణ, మధ్య, ఉత్తర, అనే మూడు ఉపకుటుంబాలుగా విభజింప



బడ్డాయి. దక్షిణ ద్రావిడ కుటుంబానికి చెందిన తమిళం, కన్నడం, మలయాళం, మధ్య ద్రావిడ కుటుంబానికి చెందిన తెలుగు మాత్రమే సాహిత్యానికి ఉపయుక్తమైన లిపిని కలిగి ఉన్నాయి. దక్షిణ ద్రావిడ ఉప కుటుంబానికి చెందిన తుళు భాషకి లిపి లేదు. సాహిత్యం ఉంది.

ఆంధ్రులు మాటలాడుకునే మృదు మధుర భావోపేతమైన భాష తెలుగు భాష. ఉత్కృష్టమైన భావనా పటిమగల భాష. ఎటువంటి శబ్దాన్నైనా ఇంపుగా ఉచ్చరింపచేయగల శక్తి దీనికి ఉంది. కర్ణాటక సంగీతానికి తెలుగువారి గొప్పకానుక తెలుగు భాష. ఆంధ్ర భాషా సౌందర్యం, అది సంతరించుకున్న పుష్టి, పెరిగినరీతి, చూపిన సొగసు, సభ్యత హృదయానందకరం.

ఇట్టి తెలుగు భాషలో నాటినుండి నేటిదాకా సాహిత్యం అనేక విధాలుగా రూపొందింది. మొట్టమొదట క్రీ.శ. 11 వ శతాబ్దం నుంచే తెలుగులో సాహిత్య ప్రక్రియ ప్రారంభమైంది. దీనికి ముందు తెలుగు అక్కడక్కడ శాసనాలలో మాత్రమే ఉంది. చాళుక్యరాజైన రాజరాజ నరేంద్రుడు రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకుని వేంగి దేశాన్ని పాలించాడు. అప్పుడు అతడి ఆస్థానాన్ని అలంకరించిన కవి నన్నయ. రాజుగారి ప్రోత్సాహంతో సంస్కృతంలో పంచమ వేదం అని చెప్పబడే మహాభారతాన్ని గొప్ప ప్రబంధంగా మార్గ కవితలో ప్రారంభించి కొంత అనువదించాడు. ఆ తరువాత 13 వ శతాబ్దంలో తిక్కన, 14 వ శతాబ్దంలో ఎఱ్ఱన మహాభారత అనువాదాన్ని అదేరీతిగా పూర్తి చేసారు. వైదిక మత ప్రధానమైన భారతాంధ్రీకరణ మార్గ కవితారీతిలో కొనసాగగా, మరో ప్రక్క నన్నెచోడాది శివకవులు శైవమత ప్రచారానికి అనేక కృతులు రచించారు. పాల్కురికి సోమన దేశి కవితామార్గంలో బసవ పురాణం, పండితారాధ్య చరిత్రలను ద్విపద గ్రంథాలుగా

## నేపాల్‌లో అభివృద్ధి పథకం

*ఖాట్మాండుకు 50 కి.మీ.ల దూరంలో నైఋతి దిక్కుగా 60 మెగావాట్ల హైడ్రో ఎలక్ట్రిక్ కాంప్లెక్స్ (జల విద్యుత్ కేంద్రం) నేపాల్‌లో చేపట్టబడిన మిక్కిలి పెద్ద అభివృద్ధి పథకం. పెద్ద పెద్ద రిజర్వాయరులలో వేసవి వానల నిల్వ నీటిని ఉపయోగించుకుంటూ శీతాకాలంలో మధ్యనేపాల్ అవసరాలను ఈ కాంప్లెక్స్ తీరుస్తుంది.*

"నీవు నీవుగా నీలోపల వెతుక్కోవాలి."

రచించారు. తిక్కన తరువాత అతడి అనుయాయులు కేతన (దశకుమార చరిత్ర), మారన (మార్కండేయ పురాణం) మొదలైనవి ఆవిర్భవించాయి. ఎర్రన యుగంలో ఎర్రన హరివంశము, నాచన సోముని హరివంశము, భాస్కర రామాయణం వచ్చాయి.



వీరి తరువాత తెలుగు సాహిత్యంలో 15 వ శతాబ్దంలో క్రొత్త శకం ప్రారంభించిన కవి శ్రీనాథుడు. శ్రీనాథుడు కవి సార్వభౌముడు. రెడ్డిరాజుల ఆస్థానకవి. ఈ కవి కాలంలో తెలుగు సాహిత్య ప్రక్రియలు అనేక విధాలుగా విలసిల్లాయి. శ్రీనాథుని కాలంలో పోతన (భాగవతము), అనంతమాత్యుని (బోజరాజీయము), జక్కన (విక్రమార్క చరిత్ర), పిన వీరభద్రుని (శృంగార శాకుంతలము) మొదలైనవి ఆవిర్భవించాయి.

ఇటు శ్రీనాథుని యుగానికీ, అటు రాయల యుగానికి మధ్య మొదటి కవయిత్రి మొల్ల రామాయణం శ్రీనాథాదుల లక్షణ ప్రబంధ రీతిలో రచించింది.

తరువాత క్రీ.శ. 1500 మొదలు 1600 వరకు శ్రీకృష్ణదేవరాయల యుగం. ఇది తెలుగు సాహిత్యంలో మిక్కిలి ప్రాముఖ్యమైన యుగం. ఈ యుగంలోనే తెలుగు సాహిత్యం సర్వతోముఖాభివృద్ధి పొందింది. అందుకే దీనిని తెలుగు సారస్వత రంగానికి స్వర్ణయుగం అన్నారు. మహాపరాక్రమంతో అనేక దేశాలను జయించి సామ్రాజ్యాన్ని స్థాపించిన శూరుడు, రాజ్యలక్ష్మి కంటే సారస్వత లక్ష్మిని ఆదరాభిమానాలతో ఆరాధించిన రసికుడు శ్రీకృష్ణదేవరాయలు. రాయలు స్వయంగా కవి. శృంగార రస ప్రధానంగా అయిదు ఆశ్వాసాల 'ఆముక్త మాల్యద' గొప్ప గ్రంథాన్ని రచించాడు. కవులను పోషించాడు. ఆనాడు కవులు ఒకరిని మించి ఒకరు పోటీగా కావ్యాలు వ్రాయడం ప్రారంభించారు. వీరి ఆస్థానం అలంకరించిన అష్టదిగ్గజ కవులలో అల్లసాని పెద్దన మనుచరిత్రము, ముక్కు తిమ్మనాచార్యుని పారిజాతాపహరణము, ధూర్జటి కాళహస్తీ మహాత్మ్యము, తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యము, రామరాజ భూషణుని వసు చరిత్రము, పింగళి సూరన కల్పితా కథకావ్యం కళాపూర్ణోదయం మొదలైనవి ఉద్భవించాయి. ఈ శతాబ్దంలోనే అచ్చతెలుగు కావ్యాలు, చిత్ర కావ్యాలు, నిరోష్ఠ్య కావ్యాలు వచ్చాయి.

విజయనగరరాజ్య పాలనానంతరం కృష్ణదేవరాయల ఏలుబడిలో ఉన్న దక్షిణ దేశ రాజ్యాలు స్వాతంత్ర్యం పొందాయి. 17-18

## కొన్ని పదాలు - వ్యతిరేకపదాలు

| | | |
|---|---|---|
| నాస్తికుడు | ... | ఆస్తికుడు |
| విజ్ఞానము | ... | మతము |
| అవ్యక్తము | ... | వ్యక్తము |
| హేతువాదము | ... | భావప్రేరితము |
| శిరస్సు | ... | హృదయము |
| బుద్ధి | ... | అతీంద్రయదృష్టి, అంతర్ జ్ఞానము |
| | ... | సంశ్లేషాత్మక |

"మనకు లేనివాటిని గురించి చింత పడేకంటే ఉన్నవాటిని చూసి ఆనందపడడం నేర్చుకోవాలి."

శతాబ్దాల మధ్య తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరు సంస్థానాలలో తెలుగు సాహిత్యం అభివృద్ధి పొందింది. తంజావూరి నాయకులకు తంజావూరు రాజధాని. తంజావూరి పాలకులలో సాహిత్య పోషణ, లలిత కళాభివృద్ధి గావించిన రఘునాథనాయకుడు పేర్కొనదగినవాడు. వీరి ఆస్థానంలో మధురవాణి, రామభద్రాంబ మొదలైనవారు సంగీతంతో పాటు సాహిత్యంలో కూడా నిష్ణాతులై ఆస్థాన కవులతో సమానంగా గౌరవించబడ్డారు. రంగాజమ్మ ప్రభువుచే కనకాభిషేక సత్కారాలు పొందిన కవయిత్రి. అనేక శృంగార కావ్యాలు వెలువడ్డాయి. ముద్దుపళిని రాధికా స్వాంతనము, సుముఖం వేంకట కిష్టప్పనాయని అహల్యా సంక్రందనం, రాధా మాధవ సంవాదం మొదలైనవి వచ్చాయి. దక్షిణాంధ్ర కావ్యాలు ముఖ్యంగా శృంగార రసాత్మకాలు. మైసూరు సంస్థానంలో వచన కావ్యాలు బయలుదేరాయి. కళువె వీరరాజు వచన భారతం రచించాడు. ఈ కాలంలోనే తెలుగు వాగ్గేయకారులైన భక్తులు రచించిన క్షేత్రయ్య పద్యాలు, త్యాగరాజస్వామి కీర్తనలు ప్రసిద్ధి పొందాయి. దక్షిణాంధ్ర యుగకాలంలో ప్రభుపోషణ తగ్గిపోయింది. కూచిమంచి తిమ్మకవి అచ్చతెలుగు రామాయణం, రసిక జన మనోభిరామము బయలుదేరాయి. ఆ తరువాత చంద్రరేఖా విలాపం వంటి తిట్టు కావ్యాలు కొన్ని, రామరాజీయము, కృష్ణరాజీయము వంటి చారిత్రక కావ్యాలు బయలుదేరాయి. తరువాత సుమతీ శతకం, వేమన శతకం వంటి శతక వాఙ్మయం వృద్ధి పొందింది. దండకాలు, లఘుకృతులు ఎన్నెన్నో వచ్చాయి. చాటు పద్యాలు రచింపబడ్డాయి. అనేక లక్షణ గ్రంథాలు, ఛందో వ్యాకరణ గ్రంథాలు, నిఘంటువులు వెలువడ్డాయి.

19 వ శతాబ్దంలో పాశ్చాత్య ప్రభావం అధికమైంది. ప్రాచీన సాహిత్యంతో పాటు అనేక రకాల నవ్యనూతన ప్రక్రియలు ఏర్పడ్డాయి. ఈ యుగంలో ఆశుకవిత, అవధానకవిత ఆంధ్రదేశమందంతటా ప్రారంభమైంది. నాటక రచన అతి విస్తృతంగా వ్యాపించింది. స్వతంత్ర నాటకాలు, నవలలు వ్రాయబడ్డాయి. ప్రాచీన కవిత్వానికి స్వస్తిచెప్పి కందుకూరి వీరేశలింగం పంతులుగారు నవ్య కవితా జ్యోతిని వెలిగించారు. కందుకూరి వారు, తిరుపతి వెంకటకవులు వచన వాఙ్మయాన్ని ప్రారంభించారు. స్వీయ చరిత్రలు, ప్రహసనాలు ప్రారంభింపబడ్డాయి. విమర్శనలు, వ్యాసాలు, ఉపన్యాసాలు అసంఖ్యాకంగా వచ్చాయి. క్రొత్త క్రొత్త సారస్వతాభిరుచులను నెలకొల్పారు. అనేక సాంఘిక ప్రబంధాలు వెలువడ్డాయి. సాంప్రదాయక కవిత సన్నగిల్లింది. వచన పద్య కవితావిహారం ప్రారంభమైంది. అష్టావధానాలు, శతావధానాలు

(మిగతా 34 వ పేజీలో)

## ఊదారంగు సరస్సు



అల్జీరియాలో ఒక ఊదారంగు నీటి సరస్సు ఉంది. దీనిలోకి ప్రవహించే రెండు నదులనీరు కలిసినప్పుడు ఏర్పడే అపూర్వ రసాయనిక చర్య ఈ రంగుకి రహస్యం అని అంటున్నారు.

-'మిసా' సౌజన్యంతో

" ప్రతీ ఇల్లూ ఒక విశ్వవిద్యాలయమే,
తలిదండ్రులు దానిలోని ఉపాధ్యాయులు."

# నమ్మలేని నిజాలు

## నమ్మలేని పోలిక

**1900** జూలై 28 న ఇటలీ దేశపు 1వ ఉంబెర్టో రాజు మోన్‌జా అనే హోటలులో జనరల్ పోంజియా - వాగ్లియాతో కూడా రాత్రి భోజనం చేసాడు. దగ్గర నుంచుని ఉన్న ఆ




హోటలు ప్రొప్రైటర్ అన్ని విధాల రాజును పోలి ఉన్నాడు. అదే ఎత్తు, అదే మీస కట్టు, అదే రూపం, అదే రాజు ముఖం, 'ఏం పోలిక!' అనుకున్నాడు రాజు.

రాజు వేసిన ప్రశ్నలకు ప్రొప్రైటర్ ఇలా జవాబు చెప్పాడు. 'నా పేరు ఉంబెర్టో. నేను 1844 మార్చి 14 న టోరినోలో ప్రొద్దున్న 10.30 కు పుట్టాను. మార్గెరిటాను నేను 1866 ఏప్రిల్ 2 న వివాహం చేసుకున్నాను. నాకు ఒక్కడే కుమారుడు. అతడి పేరు విట్టోరియో' అన్నాడు. తరువాత రాజు కూడా 'అదే నేను పుట్టిన రోజు కూడా! నా స్వస్థలం కూడా టోరినో. నీ పెళ్ళిరోజు, నా పెళ్ళిరోజు ఒకటే. నా రాణి పేరు, నీ భార్య పేరుతో సమానంగా ఉన్నాయి. నా కొడుకు పేరు కూడా విట్టోరియో' అన్నాడు.

తరువాత మాటల సందర్భంలో హోటల్ ప్రొప్రైటర్ 1878 జనవరి 9న, రాజు ఉంబెర్టో సింహాసనం ఎక్కిననాడే ప్రారంభించినట్టు తెలిసింది. ఇద్దరూ కూడా రెండుసార్లు సైన్యంలో పని చేసారు. ఆరెండుసార్లు కూడా వీరిద్దరే ధైర్యానికి గుర్తింపబడి గౌరవించబడ్డారు.

రాజు తన 'డబుల్'ను మరునాడు ప్రత్యేక మెమెంటో ఇవ్వడానికి క్రీడా సమావేశానికి రమ్మని ఆహ్వానించాడు. మరునాడు రాజు క్రీడా సమావేశానికి వచ్చి 'డబుల్' కోసం చూసాడు. అంగరక్షకుడు రాజు పేరుగల డబుల్ ఆ దినం ఒక తుపాకీ ప్రమాదంలో మరణించాడు అని చెప్పాడు. రాజు ఆశ్చర్యం నుంచి తేరుకునే లోపల ఒక హంతకుడు ఘోరంగా తుపాకీ గుండ్లు పేల్చి రాజును చంపేసాడు.

## భయంకరమైన న్యూక్లియర్ ప్రమాదం

*ప్రపంచంలో మిక్కిలి భయంకరమైన న్యూక్లియర్ (అణు) ప్రమాదం - యుఎస్ఎస్ఆర్ చెర్నోబైల్ (chernobyl) అణు విస్ఫోటనంలో 1000 మందికి తీవ్రమైన గాయాలు ఏర్పడ్డాయి. 31 మంది మరణించారు. 1,35,000 మంది యుక్రైన్‌లో తమ నివాసగృహాలను వదలి వెళ్ళిపోయారు. కనీసం 3 బిలియను డాలర్లు (3,000 మిలియను డాలర్లు) ఆర్థిక నష్టం ఏర్పడింది.*

*-'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో*

"తనలోపం తెలుసుకున్న వాడే మానవుడు."

# నీ కలుపుగోలుతనం ఎంత?

మనలో చాలామంది అందంగా ఉండే వాళ్లని, తియ్యతియ్యగా మాట్లాడేవాళ్లని సహజంగా స్నేహంగా ఉండే వాళ్లని చూస్తే ఎంతో సంబరపడతాం.



క్రింద ఇచ్చిన ప్రశ్నావళికి 'ఔను', 'కాదు' అని జవాబులు సరిగ్గా చెప్పి చివర ఇచ్చిన సమాధానం చదువుకుంటే నీ కలుపుగోరుతనం విలువ నీకే తెలుస్తుంది.

ఎ. నీ రూపురేఖలు:

1. నీ వ్యక్తిగతమైన అలవాట్లు, అభ్యాసాలు, పరిశుద్ధత, ఆరోగ్య రక్షణ గురించి ఎప్పుడూ తీసుకోవలసినంత శ్రద్ధ తీసుకుంటావా?
2. సాధ్యమైనంత అందంగా ఉండగలుగుతున్నానని నిజంగా గర్వపడతావా?
3. నీకు సరిగ్గా నప్పే రంగులు, నీ పద్ధతి, నీ వైఖరి నీకు తెలుసా?
4. నీవు ఎప్పుడూ సమయానుకూలంగా బట్టలు ధరిస్తావా?
5. నీలో అందం ఎక్కడ ఉందో నీకు తెలుసా? (ఉదాహరణకి మంచి జుట్టు, అందమైన శరీర చ్ఛాయ). వాటిని సక్రమంగా కాపాడుకుంటున్నావా?

బి. పొందే విధానం:

6. వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూ ఠీవిగా నడవడం అభ్యాసం చేసుకుంటావా?
7. ఎదుటివారితో మాట్లాడేటప్పుడు వారిని ఎదురుగుండా చూస్తావా?
8. విసుగుతో చిరాకు పడిపోవడం కంటే ఎక్కువ సార్లు చిరునవ్వు నవ్వుతూంటావా?

(32 వ పేజీ తరువాయి)

ప్రారంభింపబడ్డాయి. ఆంధ్రదేశంలో స్వదేశాభిమానం ప్రారంభమైంది. 20 వ శతాబ్దారంభంలో గురజాడ అప్పారావు కవి ఆధునిక కవిత ధ్వజాన్ని ప్రతిష్ఠించాడు. నవ్య కవితకు నాంది పలికాడు. మానవతా వాదము, విశ్వ మానవ ప్రేమ, అంధ విశ్వాస నిరసన, దేశభక్తి మొదలైన ప్రవృత్తులు వ్యాప్తి పొందాయి. గేయకథాకావ్యాలు ప్రోత్సహింప బడ్డాయి. బాలుర పాటలు కొల్లలుగా వచ్చాయి. ప్రణయ కవిత్వం బయలుదేరింది. భావ కవిత్వం బయలుదేరింది. భావ కవిత్వము - పూర్వ కవితా రీతులపై తిరుగుబాటుగా ఆవిర్భవించినట్లే, అభ్యుదయ కవిత్వం భావ కవిత్వంపై వైముఖ్యాన్ని ప్రకటించింది. అటు తరువాత పలాయన వాద కవిత్వం, దిగంబర కవిత్వం, విప్లవ కవిత్వం, ఛందోబంధాలు లేకుండా స్వేచ్ఛగా వ్రాయబడే వచన కవిత్వం ఉద్భవించాయి. ఈ విధంగా నేడు ఆధునిక కవిత్వం అనేక తోవలు తొక్కుతూంది.

"కృతజ్ఞత తెలుపుకోవడం విధి,
దానిని ఆశించే హక్కు ఎవరికీ లేదు."

9. ఇతరుల పట్ల నిజమైన ఆసక్తిని ప్రకటిస్తావా? ఉదాహరణకి వాళ్లని గురించి వారు నీతో చెప్పుకునే దానిమీద, వారు చేసే దాని మీద.

10. నీలో అసహ్యించుకునే అలవాట్లు, ఇతర అభ్యాసాలు నీకు తెలుసా? తెలిస్తే వాటిని సరిదిద్దుకోడానికి ప్రయత్నం చేస్తావా?

సి. నీ సంభాషణ తీరు:

11. నీ కంఠస్వరాన్ని గురించి ఇతర స్నేహితులను అడిగి గానీ లేక రికార్డు చేసుకుని వినసొంపుగా చేసుకోడానికి ప్రయత్నిస్తున్నావా?

12. నీవు వ్యాకరణయుక్తంగా గ్రాంథికంగా మాట్లాడతావా? అసలు విషయం మరచి పోకుండా.

13. ఇతరులు వినడానికి శ్రమ పడిపోకుండా స్పష్టంగా మాట్లాడగలుగుతావా?

14. తడుముకోకుండా ముఖ్య విషయాలు మాట్లాడడానికి స్ఫురణకు వస్తాయా?

15. నీవు మాట్లాడడానికి, ఇతరులు మాట్లాడితే వినడానికి నీకు ఇష్టం ఉంటుందా?

డి. నీ వ్యక్తిత్వం:

16. సాధారణంగా పరాయివాళ్ళంటే ఇష్ట పడతావా? వాళ్లతో సులభంగా సరిపెట్టుకో గలుగుతావా?

17. విమర్శకు ప్రారంభించకుండా కరుణారస స్వభావంతో ఇతరులకు ఏదైనా సహాయ పడడం నీ సహజ స్వభావమా?

18. ఇతరులకు ఏ ఇబ్బంది, చికాకు కలిగించ కుండా నేర్పుగా, సామర్థ్యంగా మెలగ గలుగుతున్నావా?

19. సులభంగా ఇతరుల లోపాలను పట్టించు కోకుండా, లెక్కచేయకుండా ఉండగలుగు తున్నావా?

20. నలుగురితో కలిసి మెలిసి తిరగడానికి సంతోషపడతావా?

ప్రతీ 'ఔను' అనే సమాధానానికి అయిదేసి మార్కులు వేసుకో. ఈ ప్రకారం వేసుకుంటే 70 మార్కులు వస్తే ఏ చింతా ఉండదు. కానీ 60 మొదలు 70 మార్కులు లోపుగా వస్తే సంతృప్తికరం, ఫరవాలేదు. 60 లోపుగా వస్తే చాలదు. 'కాదు' అనే జవాబులను బట్టి లోపాలను సరిదిద్దుకోడానికి ప్రయత్నించు.

ఉదాహరణకి నీ కంఠస్వరంతో గానీ, నీ ప్రసంగ ధోరణితో గానీ నీకు సంతృప్తి లేకపోతే ప్రతీరోజూ కొంతసేపు గట్టిగా చదవడం అభ్యాసం చేసుకో. అంతకంటే సంభాషణ చాతుర్య శిక్షణలో చేరు, అదీ గాకపోతే స్థానిక డ్రామా గ్రూపులో చేరు.

## జీవితం తీరు




లంచమిచ్చి స్కూలులో సీటు తెచ్చుకున్నా.
లంచమిచ్చే పరీక్షలు పాసైనా.
లంచమిచ్చే ఈ ఉద్యోగం సంపాదించుకున్నా.
ఇప్పుడు నిజాయితీ ఎలా ప్రదర్శించగలను?

> "ద్వేషం ఉన్నచోటే ప్రేమ ఉంటుంది."

# తోటకూర

తోటకూర అంటే తెలియని వారుండరు. ఈ ఆకుకూర భారతదేశంలో ఎక్కడపడితే అక్కడ విరివిగా పెరుగుతుంది, దొరుకుతుంది. తోటకూర, బలుసుకూరతో పచ్చడి పిత్ర్య కార్యాలకు విధిగా ఉండాలి. దీనిని సంస్కృతంలో 'మరేడు' లేక 'మహాశాక' అంటారు.

తోటకూరలో మొక్క తోటకూర, పెరుగు తోటకూర, రేగతోటకూర, చిలక తోటకూర, ముళ్ల తోటకూర, కొయ్ తోటకూర అని అనేక రకాలు ఉన్నాయి. ఇవి అన్నీ కూడా వంటకీ, వైద్యానికి కూడా పనికివస్తాయి. ఇంచుమించు న్ని పోషక పదార్థాలూ, విటమిన్లూ అత్యధికంగా లభ్యమయ్యే శాకములలో తోటకూర మొట్ట మొదటిది.

రెండు కప్పుల పాలుగానీ, 500 గ్రాముల ఆపిలు పండుగానీ, 5 కోడిగ్రుడ్లు గానీ, మూడు నారింజ పండ్లు గానీ, 25 గ్రాముల మాంసము గానీ తిన్నప్పుడు పొందే జవసత్వాలు అరకప్పు తోటకూరరసంలో ఉన్నాయంటే దీని పోషకశక్తి మనకు అర్థమవుతుంది. ఖరీదైన పండ్లూ, మాంసము కొని తినలేని పేదలపాలిటి పెన్నిధి తోటకూర అంటే అతిశయోక్తి కాదు.

బలవర్ధకమైన తిండిలేనివారూ, రక్తం క్షీణించి నీరసపడేవారూ, అన్నిరకాల కాలేయపు రోగులూ తగిన వైద్యం చేయించుకుంటూ రోజూ రెండు మూడుసార్లు ఒక కప్పు తాజా తోటకూర రసం త్రాగుతూ ఉంటే బ్రహ్మాండమైన విటమిన్లు, ఖనిజాలు ఉన్న టానిక్‌లా పనిచేస్తుందని డా. అమన్ అన్నారు.

తోటకూరలో ఏ, బి1, బి2, సి విటమిన్లు, సున్నం, పొటాషియం బాగా ఉన్నాయి కాబట్టి నేత్ర, శ్వాశకోస సంబంధమైన రుగ్మతలు, కేన్సరు, వంధ్యత్వం, తరచు జలుబు వంటి జబ్బులు నిరోధింపబడతాయి.

ఉడికించిన తోటకూరలో తేనె కలిపి గోదుమ రొట్టెలు తింటే ఎంతమొండి మలబద్ధకమూ లొంగిపోతుంది. ప్రేగులలో కురుపూ, కడుపులో బల్లా నివారింపబడతాయి. అనేక లైంగిక రోగాలకు దివ్య ఔషధంగా పని చేస్తుంది. తోటకూర తాజారసం తేనెలో కలిపి తీసుకుంటే శ్వాశకోసమువాపూ, గొంతునొప్పి, ఉబ్బసం, క్షయ మాయమవుతాయి.

## ఫుట్‌బాల్ కింగ్ స్కోర్ చేసిన గోలులు 1,242



*ప్రారంభించిన మొదటి ఆట సంతోష్ (7 సెప్టెంబర్, 1956) నుండి రిటైరు అయ్యేవరకు (2 అక్టోబర్, 1974) దక్షిణ అమెరికా బ్రెజీలుకు చెందిన ఫుట్‌బాల్‌కింగ్ పీలీ 1,242 గోలులు స్కోరు చేసాడు. వీటిలో 112 అంతర్జాతీయ మాచ్‌లలో బ్రెజీలుకి స్కోరు చేసిన 97 గోలులు కూడా ఉన్నాయి.*

'చూపు అనేది ఒక శక్తి, చూడడం అనేది ఒక కళ.'

తోటకూర గర్భిణీ స్త్రీలకు వర ప్రసాదము వంటిది. రోజూ ఒక కప్పు తోటకూర రసంలో కొద్దిగా తేనె, ఒక చిటికెడు ఏలకపొడి కలిపి ఇస్తే గర్భస్థ శిశువుకు అదనముగా కావలసిన సున్నమూ, ఇనుమూ, తల్లి తీసుకున్న తోటకూర నుంచే లభ్యమై తల్లిని నీరస పెట్ట కుండా పిల్ల ఏపుగా ఎదుగుతుంది. గర్భ కోశం కండరాలు సులభంగా సడలి సుఖ ప్రసవం సంభవిస్తుంది. తరువాత చికాకులు లేకుండా బాలెంతరాలు లేచి ఆరోగ్యంగా తిరుగ గలుగుతుంది. పిల్లకు కావలసినన్ని పాలు కూడా పడతాయి.

ఒక టీ ఛెంచారసం కొన్ని చుక్కలు తేనె కలిపి పాప పుట్టిన రెండవ వారం నుండీ పడుతూఉంటే రోజూ విరేచనము అయి మలబద్ధము చేయదు. పండ్లు వచ్చేటప్పుడు చికాకు చేయదు. బిడ్డ ఆరోగ్యం పెరుగుతుంది. ఎదుగుతూన్న బాలబాలికలకు అన్నిరకాల అమినో ఆమ్లములు ఉన్న తోటకూర రసాన్ని మించిన టానిక్ ఇంకొకటి లేదు.

ఉష్ణ దేశవాసుల తిండిలో తగినంత పోషక శక్తి లేనందున అనేకరకాల రక్తహీనతలు వస్తాయి. అందులో ఇనుము లోపం వల్ల వచ్చే అనీమియా (Anaemia) చాలా ముఖ్య మైనది. దీని వలన చాలా మంది ఆయువు క్షీణించి బాధపడుతున్నారు. ఈ రోగులు అను దినం ఒక కప్పు తోటకూర రసం అలవాటుగా తీసుకుంటే అందులో శరీరానికి అవసరమైన దానికన్నా రెండు రెట్లు ఇనుము లభ్యమవు తుంది. ఇంతే కాక ఈ ఇనుము సరాసరి వంటబట్టిపోతుంది. తక్కిన ఐరన్ టానిక్కు వలె తుప్పురుచి కలిగి కడుపులో తిప్పు కలిగించదు.

వృద్ధాప్యంలో శరీరానికి కావలసిన ఇనుమూ, సున్నమూ అవసరమైన నిష్పత్తిలో అందవు. ఇవి ఉన్న తోటకూర రసం దీని నిష్పత్తిని సరియైన స్థాయిలో ఉంచి ముసలితనాన్ని ముంచుకు రానీయదు. వయసు మీరిన వారి ఎముకలలోని సరిసమానపు సున్నపు వ్యాప్తిని తోటకూరలోని ఇనుపకణాలు అదుపులో ఉంచి పుష్టిని కలుగచేస్తాయి.

ఆకు కూరలలోఉన్న ఇనుము అంతా పూర్తిగా వినియోగపడాలంటే దీనిని సాయం సమయాల లోనే కోసుకోవాలి. రాత్రి మొక్క ఆకులలోని ఇనుమును కొంతవరకూ తన పెరుగుదల కొరకు వినియోగించుకుంటుంది. అందుచేత ఆకులలోని

## నిరంతర విద్యార్థికి వృద్ధాప్యం లేదు



*20 సంవత్సరాల వయస్సులో ఉన్నా 80 సంవత్సరాల వయస్సులో ఉన్నా విద్య మానుకున్న వారు ఎవరైనా వృద్ధులే, నిరంతరం విద్యార్థికి వృద్ధాప్యం లేదు. మనస్సును యౌవ్వనంలో ఉంచు కోడమే జీవితంలో గొప్ప విషయం.*

—హెన్రీఫోర్డ్

"ఒకరిలోపాలను ఒకరు పరస్పరం క్షమించుకోలేనివారు స్నేహితులుగా ఎక్కువకాలం మనలేరు."

ఇనుము శాతం ఉదయం కన్నా సాయంత్రం ఎక్కువ ఉంటుంది. అంతేగాక ఆకుకూరలను ఎక్కువ నీటితో చాలాసేపు ఉడికించరాదు. తోటకూర తరిగి శుభ్రం చేయడం కంటే తరిగే ముందు శుభ్రం చేయడం ఉత్తమం.

ఒక కప్పు తోటకూర రసంలో ఒక టీ చెంచా నిమ్మపండు రసం కలిపి రాత్రి త్రాగితే రక్తస్రావం అరికట్టబడుతుంది. మూత్ర పిండములూ, కాలేయమూ, హృదయానికి సంబంధించిన రోగాల వల్ల శరీరం పొంగినపుడు (Oedema) ఈ మందు తీసుకుంటే నీరుడు దారాళంగా జారీ అయి, మూత్రం నుండి భారీగా ఉప్పు విసర్జింపబడి, రక్తంలోని కొలెస్టరాల్ (Cholestrol) తగ్గి రక్తపోటు దిగుతుంది. హృదయం మీదా, నరాల మీదా టానిక్‌లా పని చేస్తుంది. ఒంటి నొప్పులు తగ్గుతాయి.

తోటకూర ఆకుల రసం తలకు రాసుకుంటే జుత్తు నిగనిగలాడుతూ ఒత్తుగా పెరుగుతుంది తొందరగా నెరియదు. ఈ రసంలో ఒక చిటికెడు పసుపు పొడి కలిపి ముఖానికి రాసుకుంటే మొటిమలూ, ముడతలూ పోయి మంచి వర్చస్సు వస్తుంది. దీనిలో కొద్దిగా పాలూ, నిమ్మరసం కలిపి అవయవాలకు రాత్రి రాసుకుని పండుకుంటే ఉదయానికి శరీరం వికసించిన పుష్పంలా ఉంటుంది. సులభసాధ్యమైన ఈ ప్రక్రియను సౌందర్యోపాసకులు ఆచరించి స్వల్ప వ్యయంతో అధికఫలం పొందవచ్చు.

తోటకూర ఆకుల రసంలో ఒక చిటికెడు గంధకం పొడి కలిపి స్నానానికి అరగంట ముందుగా వంటికి పట్టించుకుంటే చిడుము, గజ్జి, తామర వంటి చర్మవ్యాధులు నయమవుతాయి.

-'ఈనాడు' సౌజన్యంతో

# పీటికి అర్థం తెలుసుకో



*ఆశ్రమం:* మఠము, మునులు నివసించే చోటు. బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమాలకు సంబంధించినది.

*ఆదిశేషుడు:* ఏడు పడగల సర్పము. విష్ణువుకి పర్యంకం.

*ద్రావిడ:* తమిళము, తెలుగు, మలయాళము, కన్నడ మరియు తుళు దక్షిణదేశపు భాషలకు సమానమైనది.

*కంచి:* కంజీవరం లేక కాంచీపురానికి మరోపేరు. అయోధ్య మధుర మొదలైన ఏడు పుణ్యక్షేత్రాలలో ఒకటి.

*లింగం:* పరమశివుని ప్రాతిపదిక రూపము, పానవట్టము మీది శివమూర్తి. వాయులింగం, తేజోలింగం, అప్‌లింగం, ఆకాశలింగం, పృథ్విలింగం - పంచలింగాలు, చిహ్నము, కపటువేషము, వ్యాకరణంలో స్త్రీ, పురుష, నపుంసక లింగాలు, మచ్చ.

*మండపము:* లేక మంటపము. దేవతా విగ్రహాలను పెట్టడానికి చుట్టూ గోడలు లేకుండా స్తంభాల మీద కట్టిన కట్టడము. తాత్కాలికంగా వివాహాది శుభకార్యాలకు గోడలు లేకుండా కట్టిన చావడి.

*వినాయకుడు:* జాతిని నడిపించేవాడు. గణేశుడు లేక పిళ్లైయార్ (తమిళం), ఏనుగు తల దేవుడు. పరమశివుని కుమారుడు. 'ఎందుకు పనికి రానివాడు' అనే అర్థం కూడా వాడుకలో ఉంది.

---

'స్వానుభవంతో పాఠాలు నేర్చుకునేవారు జ్ఞానులు, పరానుభవంతో పాఠాలు నేర్చుకునే వారు వివేకవంతులు, స్వానుభవంతోగానీ, ఇతరుల అనుభవంతో గానీ పాఠాలు నేర్చుకోనివారుఅజ్ఞానులు.''

# వరల్డ్ కప్ ఫుట్‌బాల్

## వరుసగా ఫైనల్స్‌లో గెలుచుకున్న ఒకే ఒక క్రీడాకారుడు

1958 స్టాక్‌హోమ్ మరియు 1962 శాంటియాగో ఫైనల్స్ మాచ్‌లలో వరుసగా గెలుపొందిన క్రీడాకారుడు బ్రెజీల్ దేశపు వావా.

## వరుసగా అయిదు ఫైనల్స్ టోర్నమెంట్స్‌లో విజయం

1950 నుండి 1966 వరకు మెక్సికోలో వరుసగా అయిదు ఫైనల్స్ టోర్నమెంట్స్‌లో ఆడి గోలులు చేసిన ఆంటోనియో కార్బాజాల్ అపూర్వ సాహసుడు.



## ఒకే వరల్డ్ కప్ విజేత గొప్ప క్రీడాకారుడు, మేనేజర్ కూడా

గొప్ప క్రీడాకారుడుగానూ, మేనేజర్‌గాను ఒకే వరల్డ్ కప్ ప్లేయరు బ్రెజీల్ దేశపు మేరియో జగాలో. ఇతడు 1958 (స్టాక్‌హోమ్)లో మరియు 1962 (శాంటియాగో)లో క్రీడాకారుడుగా విజయాలు పొందాడు. 1970 (మెక్సికో నగరం)లో మేనేజర్‌గా ఉన్నాడు.

## 580 మిలియను మంది చూసారు

మెక్సికో నగరంలో జరిగిన 1986 వరల్డ్ కప్ టోర్నమెంట్ ఫైనల్ మాచ్‌ను రికార్డు స్థాయిల్లో 2 మిలియను మంది ప్రేక్షకులు చూచారు. మరో 580 మిలియను మంది టివిలో చూసి ఆనందించారు. ఇది అమెరికా అంతరిక్ష యోధులు మొట్టమొదట చంద్ర మండలం మీద కాలు మోపినప్పుడు చూచిన వారి సంఖ్య కంటే 90 మిలియను అధికం.

## రాష్ట్రపతి భవన్ నిర్మాణం

*న్యూఢిల్లీలో భారత అధ్యక్షుని నివాసం రాష్ట్రపతి భవన్ (బ్రిటిష్ వారి పాలనలో వైస్రాయిస్ హౌస్) రూ. 1.4 కోట్ల వ్యయంతో ఎడ్విన్ లుట్యెన్స్‌చే నిర్మింప బడింది. 5000 మందికి పైబడిన కూలీలు, ఆర్టిసాన్‌లు, తాపీవాళ్లు, కార్పెంటర్లు, ఇంజనీర్లు, డిజైనర్లు, ఆర్టిస్టులు 340 గదుల భవనాన్ని ఎనిమిది సంవత్సరాలపాటు పనిచేసి చివరకు 1929 లో నిర్మాణం పూర్తి చేసారు. పూర్తి భవనం పైతలం 200 కి.మీ.ల దూరంలో ఉన్న రాజస్థాన్ ధోల్‌పూర్ నుంచి తెచ్చిన ఎర్రరాయితో తాపడం చేయ బడింది. మొత్తం 330 ఎకరాల ఎస్టేటులో భవనం అయిదు ఎకరాలమేర ఆక్రమించి ఉంటుంది.*

"తన్ను తాను తెలుసుకోవటం కంటే మానవుని జీవితంలో ఉత్కృష్టమైన కార్యం మరొకటి లేదు."

# చివరి మాట

సాక్షాత్తు పరమాత్ముడైన భగవంతునిచే చెప్పబడినది భగవద్గీత. ఇది సంసారాన్ని భంగిస్తుంది కాబట్టి దీనిని ఉపనిషత్తు అన్నారు. ఇది బ్రహ్మ ప్రాపకం కాబట్టి దీనిని బ్రహ్మ విద్య అన్నారు. ఇది యోగాలను నిర్దేశిస్తుంది కాబట్టి దీనిని యోగశాస్త్రం అన్నారు. ప్రపంచంలో అందరిని సర్వస్వము త్యజించి భగవంతుని పాదపద్మములను ఆశ్రయించమని ఉద్బోధిస్తుంది. పార్థసారధి దీనిని ప్రబోధించి అర్జునుని కర్తవ్య కర్మానుష్ఠాననిష్ఠునిగా చేస్తాడు.

ఇది మొత్తం 18 అధ్యాయాల గ్రంథము. మొదటి ఆరింటిని విషాద యోగము, సాంఖ్య యోగము, కర్మయోగము, జ్ఞానయోగము, సన్యాస యోగము, ధ్యానయోగము చేర్చి కర్మషట్కం అంటారు. ఈ కర్మషట్కం జీవుని గురించి వివరంగా చెబుతుంది. అన్ని కర్మలకు మంగళ మయమైన అంత్యఫలం భక్తి వివరింపబడింది. తరువాతి ఆరింటిని జ్ఞాన విజ్ఞానయోగము, అక్షర బ్రహ్మయోగము, రాజయోగము, విభూతి యోగము, విశ్వరూపదర్శనయోగము, భక్తి యోగము చేర్చి భక్తిషట్కం అంటారు. ఈ అధ్యాయాలలో నిర్గుణ భక్తి వర్ణింపబడింది. దీనినే ఉపాసనా షట్కం అని కూడా అంటారు. ఇవి ఉపాస్యుడగు ఈశ్వరుని వర్ణిస్తున్నాయి. ఇక మిగిలిన ఆరింటిని క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగము, గుణత్రయ విభాగ యోగము, పురుషోత్తమ యోగము, దైవాసుర సంపద్విభాగ యోగము, శ్రద్ధాత్రయ విభాగయోగము, మోక్షయోగము చేర్చి జ్ఞానషట్కం అంటారు. ఈ జ్ఞాన షట్కంలో ఐక్యజ్ఞానము మోక్షోపాయముగా వర్ణింపబడింది. ఈ చివరి ఆరు అధ్యాయాలలో జ్ఞాన, వైరాగ్య కార్యాకార్య వివేక, సగుణ, నిర్గుణ, సహితంగా భక్తియొక్క చివరి ఫలం పూర్తిగా నిరూపింపబడింది. కర్మషట్కంలో చేరిన సాంఖ్యయోగంలో దుఃఖించవలసిన పనిలేదు. నేను, నీవు, ఈ రాజులు పూర్వం ఒకప్పుడు లేము అనుట సత్యం కాదు. ఈ శరీరధారణకు పూర్వం మనం అంతా నిత్య ఆత్మస్వరూపంలో ఉన్నాం. దేహత్యాగానంతరం మనం ఎవ్వరమూ నశించము. వర్తమానంలో కూడా నిత్య ఆత్మ స్వరూపంలో ఉన్నాం. భవిష్యత్తులో కూడా ఉంటాం అని ప్రబోధించాడు.

మొత్తం 17 అధ్యాయాలలో ఉపదేశాలన్నీ ముగిసిపోతాయి. అన్నీ విన్న తరువాత అర్జునునికి తిరిగి మరోసారి తెలుసుకోవాలని అనిపించి సన్యాస శబ్దం యొక్క, త్యాగ శబ్దం యొక్క తాత్పర్యం వినాలని ఉందని అన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు 18వ అధ్యాయంలో గీతార్థం అంతా ఉపసంహారం చేస్తాడు.

"సర్వ ధర్మాన్పరిత్యజ్య మామేకం
శరణం వ్రజ
అహంత్వం సర్వ పాపేభ్యో మోక్ష
యిష్యామి మాశుచః"

(మిగతా 42వ పేజీలో)

## బ్రహ్మాండమైన 'కేక్'

*మలేషియా కౌలాలంపూర్ షటలింగ్ జయా హిల్టన్‌లో వంటవాళ్లు (Chefs) ప్రపంచంలోనే మిక్కిలి పెద్దదైన 111 మీటర్ల పొడవైన పైనాపిల్ కేకును తయారుచేసారు. దీనిని ముక్కలుగా కోసి అమ్మగా వచ్చిన లాభాన్ని మలేషియన్ చిల్డ్రన్స్ ఎయిడ్ సొసైటీకి అందజేసారు. ఈ బ్రహ్మాండమైన కేక్‌లో 4,000 గ్రుడ్లు, 150 కి.గ్రా.ల చక్కెర, 100 కి.గ్రా.ల ఫ్లోర్, 38 కి.గ్రా.ల జొన్నపిండి, 350 కి.గ్రా.ల మీగడ, 800 అనాసపళ్లు ఉపయోగింపబడ్డాయి.*

"అరచేతిని అడ్డుపెట్టుకుని అరుణోదయాన్ని ఆపలేము."

# కలం స్నేహితులు

1. ఎ.రవీందర్ బోథ్, ఇంటర్, 18 సం.లు, S/O లింబాద్రి, C/O బి.చందర్ సింగ్, ఇం.నెం. 5-74, మార్కండేయవీధి దగ్గర, మండలం, తాలూకా మరియు పోస్ట్ బోథ్, (ఆదిలాబాద్ జిల్లా) 504 304.
   మంచిమనస్సు కలవారితోస్నేహం, ప్రకృతి ఆరాధన.

2. మువ్వ నరసింగరావు, ఇంటర్ రెండవ సంవత్సరం, 16 సం.లు, S/O మువ్వ సింహాచలం, ఇం.నెం. 27-2-32, నాగవంశవు వీధి, దాసన్నపేట పోస్ట్, (విజయనగరం జిల్లా) 531 202.
   పుస్తక పఠనం, ప్రకృతి ఆరాధన, క్రికెట్ ఆడటం.

3. బి.శరత్ చంద్ర, బి.ఇ., ఇం.నెం. 1-2-49/H/2, చర్చి దగ్గర, క్రిస్టియన్ కాలనీ, మహబూబ్ నగర్ - 509 001.
   ఫోటోగ్రఫీ, ప్రకృతి ఆరాధన, కార్టూన్ వేయడం.

4. ఎన్.సాయి, C/O కె.నాగరత్నం, ఇం.నెం. 23/959, ఫతేఖాన్ పేట మెయిన్ రోడ్డు, (నెల్లూరు జిల్లా) 524 003.
   సంగీతం వినడం, చిత్రలేఖనం, కలంస్నేహం.

5. అంబటి సాయిబాబు, బి.కామ్ (సి.ఎ), 24 సం.లు, S/O ఎ.రామకృష్ణరావు, ఎ.ఎస్. అండ్ కంపెనీ, మట్టం సెంటర్, సామర్లకోట, (తూ.గో.జిల్లా) 533 440.
   క్రికెట్, పుస్తకాలు చదవడం, ఫిలాసఫీ.

6. ఎస్.లక్ష్మీనారాయణ బాబు, ఎస్.ఎల్.ఎన్. వీడియో కవరేజ్ మరియు స్టూడియో, మదుగిరి, టుంకూరు జిల్లా (కర్ణాటక) 572 132.
   కలంస్నేహం, ట్రావలింగ్, ఫోటోగ్రఫీ.

## ధైర్యం, సమర్పణ భావం విజయానికి మెట్లు



*దారితప్పి ముందుకు సాగలేనప్పుడు, అడుగు తీసి అడుగువేయడానికి శ్రమవుతున్నప్పుడు, దారి దూరంగా ఉన్నప్పుడు, కనుమేర చూపులో లక్ష్యం కనిపించనప్పుడు నిరాశపడకు, తిరిగి ప్రయత్నించు. మరోజీవితం క్రొత్త జీవితం ప్రారంభమవుతుంది. పోరాటంతో జీవితం జీవించాలి. సిద్ధమైన వారికి ఎంతో ముందుంది జీవితం. అపజయంతో వదలు కోడం కష్టంకాదు. ధైర్యవంతుడే తిరిగి చేయగలడు. విచారం వద్దు, తిరిగి ప్రయత్నించు. ధైర్యసాహసాలు అవలంబించాలి. నిర్భయం, సమర్పణ భావం దిగ్విజయానికి మెట్లు. ఎక్కడం కష్టమే. ఆగిపోవద్దు. మధ్యలో వదిలేవారు ఎంతోమంది. వృథా కాలయాపన వద్దు. లే! లెమ్ము! తిరిగి ప్రయత్నించు. జీవితంలో సాధించవలసింది ఎంతో!*

*—ఆనీ జోసెఫ్, 'రోటరీ న్యూస్' సౌజన్యంతో*

" మనం కోరింది మనకు లేనప్పుడు ఉన్నదే కోరుకోవడం మంచిది."

7. కె.బదరీష్‌నాథ్, బి.కామ్, హనుమాన్ కాఫీ వర్క్స్, పెనుకొండ (అనంతపురం జిల్లా) 515 110.
ప్రకృతి ఆరాధన, మంచివారితో స్నేహం, సినిమాలు చూడడం.

8. శీనుబాబు, బి.ఎస్.సి, 23 సం.లు, శీనూస్ బి.ఎన్.ఆర్.స్టడీ సెంటర్, 157/12, ట్రాహన్స్ రోడ్డు, మహాలక్ష్మి థియేటర్ ఎదురుగా, మద్రాసు - 600 012.
పుస్తక పఠనం, జోకులు వేయడం, మ్యూజిక్.

9. వై.విశ్వేశ్వరరావు (చౌదరి), 24 సం.లు, C/O శాంతి నిలయం, కుందురువారి పాలెం పోస్ట్, (గుంటూరు జిల్లా) 522 408.
అందరితో కలం స్నేహం, ఆధ్యాత్మిక పుస్తకాలు చదవడం, విషయసేకరణ.

10. ఎమ్.అమరేందర్ రెడ్డి, S/O మాధవరెడ్డి, మాధారం గ్రామం, బోల్లేపల్లి పోస్టు, భువనగిరి మండలం, (నల్గొండ జిల్లా) 508 285.
పుస్తకపఠనం, మంచివారితో స్నేహం, ప్రకృతి ఆరాధన.

11. ఎమ్.శ్రీనివాస్, ఇంటర్, 28 సం.లు, S/O ఎమ్.ఎల్లయ్య శ్రీనివాసా డ్రెస్సెస్, మెయిన్ బజార్, తాండూరు, (రంగారెడ్డి జిల్లా) 501 141.
పుస్తక పఠనం, సినిమాలు చూడడం, పాటలు వినడం.

12. మల్లాది శశిభూషణ్, బి.ఎస్‌సి., ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్ 25 సం.లు, ఏ.పి.ఎస్.ఆర్.టి.సి., గుత్తి, (అనంతపురం జిల్లా) 515 401.
పుస్తక పఠనం, కథలు, కవితలు వ్రాయడం, కలంస్నేహం.

## జీవితం - తీరు




మేం ఎవరికి వోటు వేస్తామో నేను చెప్పలేను. నిర్ణయించే వ్యక్తి బజారు కెళ్ళింది.

(40వ పేజీ తరువాయి)

అని చెబుతాడు. ఇదే భగవద్గీతలో చరమ శ్లోకం. చిట్టచివరి శ్లోకం. అన్ని ధర్మా ధర్మానుష్ఠాలను పరిత్యజించి నన్నే ఆశ్రయించు. నేను సర్వాత్ముడను. నేను పరమాత్ముడను. నేను గాక ఇంకొకటిలేదనే దృఢ నిర్ణయం చేసుకో. నిశ్చిత బుద్ధి గల నీకు నేను నా స్వరూపాన్ని ప్రకటిస్తాను. ధర్మాధర్మబంధమైన పుణ్యపాపాల నుండి ముక్తునిగా జేస్తాను. దుఃఖించవలసిన పనిలేదు అంటాడు. సర్వ ధర్మాలను విడచి భగవంతుడైన తనకొక్కనికే శరణాగతి పొందినచో అతనిని సర్వపాపముల నుండి విముక్తిని చేయిస్తాననియు, శోకించవద్దనియు, చివరి సందేశంగా భగవంతుడు అర్జునునికి చెబుతాడు.

-వాధూల

" భాగ్యాభాగ్యాలు ప్రక్కప్రక్కనే ఉండే ఇరుగుపొరుగు."

# ఔషధ ప్రపంచం

## మెదడులో తెలియని జీనులు

మాస్కోలో యు.ఎస్.ఎస్.ఆర్. అకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మోలిక్యులర్ జెనిటిక్స్ వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు మానవుని మెదడులో ప్రబలంగా ప్రవర్తించే ఇంతకు ముందు కనుగొనని జీనులు ఉన్నాయని తెలుసుకున్నారు. ఇటువంటి జీనుల ఉనికిని నిరూపించి, వాటి నుంచి ప్రత్యేక ప్రొటీనులను వేరుచేస్తే వాటిని ఉపయోగించి రోగుల బ్లడ్ కౌంట్ సహాయంతో మెదడు వ్యాధిని త్వరలో తెలుసుకోడానికి వీలవుతుంది. అప్పుడు దానికి తగినట్టుగా సరియైన ఔషధం వాడి చికిత్సకు పూనుకోవచ్చు.

## అల్ట్రాసౌండ్ రేడియేటర్ ప్రోబ్

బ్రెయిన్ ఇన్‌స్టిట్యూట్ మరియు అక్కొస్టిక్స్ ఇన్‌స్టిట్యూట్‌లలో శాస్త్రజ్ఞులు క్రొత్తగా అల్ట్రాసౌండ్ రేడియేటర్ ప్రోబ్‌ను అభివృద్ధి చేసారు. ఇవి ఒక సాధారణ నాణెం పరిమాణంలో ఉండే పింగాణి మాత్ర (Ceramic Pill). దానికి ఒక తీగ జోడించబడి ఉంటుంది. అల్ట్రాసోనిక్ ప్రకంపనలు సజీవకణాలలో దూరి రేడియేటర్ ప్రోబ్ కేంద్రంలో నిరాటంకంగా తమ శక్తిని వదులుతాయి. ఈ బిందువు మిల్లీమీటరులో ఒక భిన్నంగా ఉంటుంది. అల్ట్రాసౌండ్ రేడియేటర్ ప్రోబ్ సహాయంతో మెదడులో ఆపరేషన్‌లను మెదడును తెరవకుండానే నేరుగా పుర్రెద్వారా చేయవచ్చు. చుట్టుప్రక్కల ఉండే ఆరోగ్యవంతమైన కణాలకు అపాయం కలిగించకుండా అల్ట్రాసోనిక్ కిరణపుంజం అనారోగ్యమైన కణాలను నశింపజేస్తుంది.

## స్లీపింగ్ సిక్‌నెస్‌కి ఔషధం

అతినిద్ర రోగంతో (Sleeping Sickness) మరణావస్థను పొందుతూన్న రోగులను DFMO అనే క్రొత్త ఔషధంతో పునరుజ్జీవింప జేసారు. రెండు సంవత్సరాల చికిత్సానంతరం రోగులు రోగం తిరగబెట్టకుండా సాధారణ జీవితం గడుపుతూన్నట్టు వైద్య పరిశోధనల వల్ల తేలింది. ఈ రోగం అంటురోగంగా ప్రభవించిన 36 మధ్య ఆఫ్రికా దేశాలనుంచి ప్రతీ సంవత్సరం సుమారు 20,000 మంది అతినిద్ర రోగుల క్రొత్త కేసులు వస్తున్నాయి. ట్సే-ట్సే ఈగల వల్ల సంక్రమించే ఈ పారసైటిక్ వ్యాధి వల్ల కనీసం 50 మిలియను మంది అపాయస్థితిలో ఉన్నారు.

-'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## జిరాఫీకి కంఠస్వరం లేదు



జంతువులలో జిరాఫీకి కంఠస్వరం లేదు. మెల్లిగా ఈలవేస్తుంది. ఇది దాని శారీరక ధార్మ్యత వల్ల, కాలి బలంవల్ల జీవిస్తుంది. జిరాఫీ కాలి తన్నుకి సింహం కూడా బెదిరి పారిపోతుంది.

"క్లుప్తత వాక్చాతుర్యానికి శోభ."

# కుక్కలు

రూపాల్ రావాల్

అడవులలో అతి చాతుర్యంగా వేటాడే జంతువులలో భారతదేశపు అడవికుక్క లేక ధోల్ (Dhole) ముఖ్యమైనది. ప్రస్ఫుటంగా ఏర్పడిన తల, పొడవుగా మొనదేలిన మూతి, నిటారుగా ఉండే పెద్ద చెవులు, బొద్దుగా



వెంట్రుకలతో ఉన్న తోక, బలిష్ఠమైన కాళ్లతో తోడేలులాగా సన్నగా ఉంటుంది. కానీ వీటి కాళ్లు పొట్టిగా ఉంటాయి. స్థానికంగా మరియు ఆయాకాలాలను బట్టి శరీర ఛాయ మార్పు చెందుతున్నా సామాన్యంగా ఎరుపురంగు శరీరం గల వీటిని సులభంగా తెలుసుకోవచ్చు.

సంఘీభావ బలంతో, నైపుణ్యంతో మూకుమ్మడిగా ఇవి మీద పడుతూంటాయి. సంఘజీవులైన ఈఅడవి వేటకుక్కల సామర్థ్యం అంతా వాటి కలుపుగోరుతనంలోనే ఉంది. 6 మొదలు 12 కుక్కలు గుంపులు గుంపులుగా చేరి అతి క్రూరంగా, నిర్దాక్షిణ్యంగా ఎరమీద పడి తరుముతాయి. పారిపోతున్న ఎరజంతువు ఆయాసపడిపోతుంది. సాధారణంగా దొంగ చాటుగా వెనుక నుంచి మీదికి దుమికి పట్టి ఎర జంతువు ఇంకా బ్రతికి ఉండగానే చీల్చుకు తింటాయి. వేటాడబడే జంతువు క్రిందపడి మరణించాలని లేదు. బలిష్ఠమైన వీటి దవడలు ఒకేసారి చీల్చి తినడానికి ఉపకరిస్తాయి.

చాలా అరుదుగా పులికి, ఈ అడవి కుక్కలకు జరిగే పోట్లాటలో పులి కుక్కల గుంపులో సగం కుక్కలను చంపేసినా మిగిలిన కుక్కలు పులి మీద పడి ఓడించేస్తాయి. చిరుతపులులు నైపుణ్యంగా చెట్లెక్కి అడవికుక్కల బారినుండి రక్షించుకుంటాయి. సాంబారు మృగాలు వీటి బారినుండి తప్పించుకోడానికి తాత్కాలికంగా నీటిలోకి దిగిపోతాయి. చిటాల్ మృగాలు అడవి కుక్కలకు కనిపించకుండా బాగా పెరిగిన గడ్డి మైదానాలలో దాక్కుంటాయి.

అడవి కుక్కలు గుంపు చెదిరి పోయినప్పుడు గానీ, ఎరమీద పడి వేటాడే సమయంలో గానీ, అకస్మాత్తుగా మనుష్యులను ఎదుర్కొనే టప్పుడుగానీ ఒక విధమైన ఈల శబ్దం చేస్తాయి.

(మిగతా 47వ పేజీలో)

## కోటి రూపాయలు విలువైన విగ్రహం

***అనేక సంవత్సరాలకు పూర్వం ఎనిమిది లోహాలతో తయారైన 'పౌనార్ రాజా' (Paunar Raja) విగ్రహం, రాజస్థాన్ ఆల్వార్‌లో ప్రసిద్ధి పొందిన జాగేశ్వర్ దేవాలయం నుంచి దొంగిలించబడింది. ఒక పెద్ద కొయ్యపెట్టెలో విదేశాలకు ఎగుమతికి సిద్ధంగా ఉంచిన దీనిని పోలీసులు 1975 ఏప్రిల్ 1న పట్టుకున్నారు. ఇప్పుడు ఈ విగ్రహం విలువ ఒక కోటి రూపాయలు!***

" ఆదాయాన్ని మించి వ్యయం చేసేవారు ఎవరూ ధనవంతులు కారు,
వ్యయాన్ని మించి రాబడి కలవారు ఎవరూ దరిద్రులు కారు."

# వివేకోదయం

వస్తుజ్ఞానం ఉన్నప్పుడు గ్రహణశక్తి కలుగుతుంది. గ్రహణశక్తి కలిగినప్పుడు నిర్వ్యాజ్యమైన సంకల్పం మనస్సులో ఉద్భవిస్తుంది. సంకల్పం నిష్కలంకమైనప్పుడు హృదయం విప్పారి వికసిస్తుంది. హృదయం విప్పారి వికసించినప్పుడు



వ్యక్తిగత జీవితక్రమం ప్రారంభమవుతుంది. దీంతో కుటుంబ జీవితం కుదుటబడుతుంది. కుటుంబజీవితం కుదుట బడినప్పుడు జాతీయ జీవితం సక్రమంగా సాగుతుంది. జాతీయ జీవితం సక్రమంగా కొన సాగినప్పుడు విశ్వశాంతి ఏర్పడుతుంది.

మహారాజులు మొదలుకుని సామాన్య మానవులు దాకా వ్యక్తిగత జీవితాన్ని ప్రవృద్ధి చేసుకోవడం పునాదులు నిర్మించుకోవడం వంటిది. పునాదులు దిట్టంగా లేనప్పుడు పై భవనం స్థిరంగా ఉండటం అసంభవం. ప్రకృతిలో కాండం సన్నగా ఉండి పై కొమ్మలు దట్టంగా విస్తరించుకున్న వృక్షం ఉండదు. కారణం లేకుండా ఫలితం ఉండదు. మానవ వ్యవహారాలకు ప్రారంభం, అవసానం ఉంటుంది. ఏది ముందో ఏది వెనుకో తెలుసు కోవడమే వివేకానికి ఉదయం.

-'భవాన్స్ జర్నల్' సౌజన్యంతో

( 29 వ పేజీ తరువాయి)

అరుంధతీ ముఖర్జీ : ప్రఖ్యాత బెంగాలీ నటి. మృదుమధురమైన కంఠస్వరంతో రవీంద్రనాథ్ ఠాగూర్ గేయాలను పాడి ప్రసిద్ధి పొందింది. ఈమె నటించిన సినీమాలలో 'చుట్టీ'కి 1966లో ప్రెసిడెంట్ అవార్డు లభించింది.

జీన్ పియాగెట్: స్విస్ మనస్తత్వ శాస్త్రవేత్త. మోడరన్ చైల్డ్ సైకాలజీ పితామహుడుగా ప్రసిద్ధి పొందాడు. మనస్తత్వ శాస్త్రంపై అనేక వ్యాసాలు వ్రాయడమే గాక 40 కి పైగా అనేక గ్రంథాలను రచించాడు. ఇతడు తన 10 వ సంవత్సరం వయస్సులో అల్బినో స్పారోపై ఒక వ్యాసం ప్రచురించాడు.

జాన్ మేజర్: బ్రిటన్ దేశపు ప్రధాన మంత్రి. 1894 నుంచి నేటివరకు వచ్చిన ప్రధాన మంత్రులలో వయస్సులో మిక్కిలి చిన్నవాడు. ఏ యూనివర్శిటీ విద్యార్హతలు లేకుండా 18 వ సంవత్సరం వయస్సులో బాంక్ గుమస్తాగా జీవితం ప్రారంభించాడు. నాటకాలు అంటే ఇతడికి చాలా అభిలాష.

'ఆత్మస్తుతి అబద్ధాలకు దోహదకారి.''

# వేప అనేక వ్యాధులకు ఔషధం

భారతదేశపు ఆయుర్వేద ఔషధాలలో వేప మిక్కిలి ఉపయోగకరమైనది. రకరకాల చర్మవ్యాధులకు, వివిధ జ్వరాల నివారణకు వేపచెక్క లేక బెరడు ఉపయోగపడుతుంది. ఆటలమ్మ, మసూచి, అమ్మవారు మొదలైన



అంటువ్యాధులకు వేపచెక్క కషాయం వాడతారు. శొంఠిపొడి మరియు ధనియాల పొడి చేర్చిన వేపచెక్క రసం సింకోనా చెట్లనుంచి ఉత్పాదింప బడే క్వైనైన్ కంటే అమోఘంగా పనిచేస్తుంది. కామెర్లకు, పాముకాట్లకు కూడా ఇది దివ్యమైన ఔషధం.

వేపాకు ఉడకబెట్టిన వేడినీళ్లతో కాపడం పెడితే శరీరంలో ఉండే కురుపులు త్వరగా బాగా పైకి మొనతేరుతాయి. వేప ఆకులు ముద్దగా తయారుచేసి చీము పట్టిన కురుపుల మీద, పుండ్ల మీద, ఇతర గాయాల మీద కట్టవచ్చు. కలరా, ప్లేగు వంటి అంటురోగాలకు వేపచిగుళ్లు, కర్పూరం, ఇంగువ, బెల్లం కలిపి తయారుచేసిన మాత్రలు ఉపయోగించవచ్చు. వేప ఆకులు కాల్చగా వచ్చిన బూడిదను కరంజ్ (Karanj) నూనెలో కలిపి చర్మవ్యాధులకు ఔషధంగా వాడవచ్చు. కండ్లు వాచి ఎర్రబడి నప్పుడు ఉడకబెట్టిన వేప ఆకులు కట్టవచ్చు.

ప్రేగులలో క్రిమి నివారణకు, కామెర్లకు, పాము కాట్లకు, కురుపులకు, జ్వరాలకు వేపాకు రసం ఎంతో మంచిది. కుష్టు మరియు బొల్లి వ్యాధులకు కూడా వేప ఔషధంగా వాడతారు. వేపరసం ఒకటే గానీ, ఆవుపాలలో కలిపిగానీ ఈ రోగులు సేవించాలి. వేపచెట్ల నీడను పడు కోవడం కూడా వీరికి మంచిది. వేపచిగుళ్లు, వెల్లుల్లి రసం, నిమ్మరసం చేర్చి ముద్దగా తయారుచేసి తలకు పట్టిస్తే తలలో పేలు పూర్తిగా తగ్గిపోతాయి.

వేపపళ్లు ముఖ్యంగా కుష్టు రోగానికి, కడుపులో పురుగులకి, మూలశంక, మూత్రసంబంధమైన రోగాలకు చాలా మంచిది. వేపనూనె అనేక చర్మ రోగాలకు ఉపయోగపడుతుంది. కీళ్ల నొప్పులకు, తలనొప్పులకు వేపనూనె మర్దనా చేస్తారు. వేపనూనెలో తడిసిన గుడ్డవత్తి కాల్చినప్పుడు వచ్చే పొగ పీలిస్తే ఎటువంటి సైనస్ వ్యాధులైనా ఇట్టే తగ్గిపోతాయి.

## మిలియన్ల కోడ్డీ బంగాళా దుంపలు నాశనం చేసారు

*1970లో యు.ఎస్.ఎ. ఇడాహోలో బంగాళా దుంప మార్కెట్టు ధర బాగా పడిపోయి రైతుల ఖర్చులను, రవాణా ఛార్జీలను భరించలేక మిలి యనుల కోడ్డీ బంగాళాదుంపలు నాశనం చేయ బడ్డాయి.*

"ఏయాతనకైనా ఓర్పును మించిన ఔషధం లేదు."

# మెసెంజరు పావురాలు

కొన్నిరకాల పావురాలు గూటిని విడిచివెళ్ళినా తిరిగి గూటిని చేరుకుంటాయి. ఇది పుట్టుకతో వచ్చే వాటి సహజ లక్షణం. అన్నివైపులా మూయబడిన ప్లేనులలో గానీ, ఓడలలో గానీ దూరంగా తీసుకుపోయిన పావురాలు 1000 మైళ్ళైనా తిరిగి గూటికి చేరుకుంటాయి.



వార్తలను తీసుకువెళ్లడానికి ఉపయోగపడే మెసెంజర్ పావురాలు, పెంచబడే పావురాలు. గత రెండు ప్రపంచ యుద్ధాలలోను రేడియో సంపర్కం అసాధ్యం అనుకున్నప్పుడు విమానాల నుండి, ఓడల నుండి, రహస్య ఏజెంట్ల నుండి వార్తలు పంపడానికి పావురాలు వాడబడ్డాయి.

కపోతదూతలు (మెసెంజర్ పావురాలు) అనే భావన కొత్తది కాదు. 218 బిసిలో హన్నిబాల్ ఆల్ప్స్‌పర్వతాలను దాటినప్పుడు ఉపయోగించాడు. ప్రాచీన గ్రీకులు, రోమనులు కూడా వీటిని ఉపయోగించారు. 1150 లో బాగ్దాద్ సుల్తాన్ తన దేశంలో 'పిజియన్ పోస్ట్' ఏర్పాటుచేసాడు

మామూలు పావురాలులాగే గూటికి తిరిగివచ్చే పావురాలు ఒకటి లేక రెండు తెల్లటి గ్రుడ్లను పెడతాయి. 'పిజియన్స్ మిల్క్' అనే ప్రత్యేక ద్రవంతో చేర్చి చిన్న పావురాలకు ఆహారం పెట్టి పెంచుతాయి.

గూటికి తిరిగిరావాలనే అభిలాష, ముఖ్యంగా అలవాటు పడ్డ ఆహారం, నీరు, జతకూడే పక్షులు మొదలైనవి ఇవి తమ గూటికి తిరిగి రావడానికి ముఖ్య కారణాలు. వార్తాహకులుగా ఉపయోగింపబడే పావురాలకు పందెవు పావురాల వలనే నిర్ణీత ప్రదేశాలకు శీఘ్రంగా తిరిగిరావడానికి ప్రత్యేకమైన శిక్షణ, తర్ఫీదు ఇస్తారు.

## రెండు పిల్లులకు 415,000 డాలర్ల ఎస్టేటు

*యు.ఎస్.ఎ. కాలిఫోర్నియా శాన్‌డియాగోలో డా. విలియం గ్రియర్ 1963 జూన్‌లో మరణించాడు. 415,000 డాలర్ల తన యావదాస్థిని అతడు ప్రేమతో పెంచుకునే రెండు 15 సంవత్సరాల పిల్లులకు వ్రాసి ఇచ్చాడు. 1965 లో ఈ పిల్లులు మరణించినప్పుడు ఈ సొమ్ము అంతా వాషింగ్‌టన్ DC లో జార్జి వాషింగ్‌టన్ యూనివర్సిటీకి సంక్రమించింది.*

(44వ పేజీ తరువాయి)

నవంబరు మరియు డిసెంబరు మాసాల మధ్యకాలం వీటికి జతకూడే సమయం. సామాన్యంగా జనవరి, ఫిబ్రవరి మాసాలలో 4 మొదలు 6 చిన్న చిన్న పిల్లలను పెడతాయి. ఒకే ఒక కాలనీలో వివిధ కుటుంబాలు పెరుగుతాయి. ఈ కుక్క పిల్లలు పెరిగి గుంపులో చేరేదాకా కొండగుహలలోను, దట్టమైన పొదలు వెనుక ఉంటాయి.

-'సిఇఇ.-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

" నమ్మకద్రోహం కంటే, ప్రత్యక్షవైరం మంచిది."

# నేటి యువతకు సూచనలు

1. తగినట్టు తిను: సక్రమమైన సమపోషకాహారం యౌవ్వనంలో ఆరోగ్యానికి, రూప సౌందర్యానికి సహకరిస్తుంది.
2 తగినట్టు త్రాగు: శుభ్రమైన మంచినీరు, పండ్లరసం ఆరోగ్యాభివృద్ధికి అవసరం.



అల్కహాలు మాను. అది అనారోగ్యకరం.
3. సిగరెట్లు కాల్చకు: ఆరోగ్యంగా, అందంగా జీవించదలచుకుంటే సిగరెట్లు కాల్చకూడదు.
4. విశ్రాంతి తీసుకో: ఆటలు, సంగీతం, చిత్రకళ, పుస్తకపఠనం, తగినవారితో సంభాషణ, మొదలైనవి నీకు విశ్రాంతిని కలిగిస్తాయి. శ్రద్ధ అలవడుతుంది.
5. ఉత్సాహంగా ఉండు: సృజనాత్మకంగా ధన భావాన్ని వృద్ధిచేసుకో.
6. అవధులు తెలుసుకో: ముందు చూసుకుని అడుగు వెయ్యి. ఒక నిమిషం ఏమరుపాటు వల్ల, అవివేకంవల్ల జీవితానికే హాని కలుగుతుంది. అప్రమత్తతో ప్రవర్తిస్తే అకస్మాత్తుగా జరిగే ప్రమాదాలను ఎన్నిటినో తప్పించుకోవచ్చు.
7. భాధ్యతాయుతమైన కామం: నీ కాముక ప్రవృత్తిని పూర్తిగా తెలుసుకుని భాధ్యతా యుతంగా అనుసరించు.
8. ఆటలు ఆరోగ్యకరం: ఆటలు మనస్సుకి హాయిని కలిగిస్తాయి. ఆటలు ఆడే వారందరూ ఆరోగ్యాన్ని అనుభవిస్తున్నవారే.
9. నడక: నడక కూడా ఒక విధమైన క్రీడ. క్రమమైన నడక నిన్ను ఆరోగ్యంగా ఉంచుతుంది.

## క్విజ్ - జవాబులు:

1. దిటైమ్స్, లండన్, 2. వేగా, 3. సోవియెట్ యూనియన్ (ఆర్మేనియాలో), 4. (బి) కలకత్తా రేవు మేటవేసి మూసి పోకుండా ఉండడానికి, 5. (సి) మైత్రి, 6. (ఇ) డెలివరీ పోస్ట్ ఆఫీసు, 7. వింగ్ కమాండర్ మహేశ్వర్ దత్, 8. (డి) జపాన్.

## తెలివికి పరీక్ష - జవాబులు:

1. 14, 2. ఆస్ట్రేలియా ( Australia), 3. అన్ని నెలలకు, 4. మహాభారతంలో, 5. గతించిన కాలం మనదికాదు, రేపు అనేది కూడా మన చేతిలో లేదు కాబట్టి, 6. అపహరించినప్పుడు.

## మాటల మహిమ - జవాబులు:

1. కాంతి (ఎ), జిడ్డు (బి), కిరణము (సి), సారము (డి); 2. మెలిక (ఎ), అల్లము (బి), చిక్కు (సి); 3. కష్టము (ఎ), అపకారము (బి), తప్పు (సి), సంబంధము (డి); 4. వివరము (ఎ), ఉపాయము (బి), క్రమము (సి), తవసీలు (డి); 5. పర్యాయము (ఎ), తడవ (బి); 6. రజతము (ఎ), పిమ్మట (బి); 7. ప్రవర్తన (ఎ), పని (బి), వ్యాపారము (సి), వాడుక (డి); 8. వీధి (ఎ), ఇండ్లవాడ (బి), పంక్తి (సి), పరిమాణము(డి).

" కనికరంగా మాట్లాడితే, కనికరమైన ప్రతిధ్వనులు వినిపిస్తాయి."

# అంతరిక్షంలో

## శుక్రగ్రహం మీద మొట్టమొదట దిగింది

1967లో వెనెరా4 శుక్రగ్రహం మీద దిగింది. ఇదే గ్రహం మీద మొట్టమొదట దిగడం. ఈ



అంతరిక్ష పరిశోధనిని (Space Probe) రష్యనులు ప్రవేశపెట్టారు.

## చంద్రగ్రహం మీద మొట్టమొదటి అంతరిక్ష శోధిని




1959లో రష్యన్ లూనా 1 చంద్రగ్రహం మీదికి పంపిన మొట్టమొదటి అంతరిక్ష శోధిని. ఇది సుమారు 4000 మైళ్ళలో తప్పిపోయింది. యునైటెడ్ స్టేట్స్ వారు చంద్రగ్రహం మీదికి పంపిన శోధిని పయొనీర్ 4 ఇంతకంటే ఎక్కువ దూరంలో తప్పిపోయింది.

* * *

## చంద్రగ్రహం మీదికి మొట్టమొదటి స్వయంచాలక వాహనం

1970 నవంబర్‌లో రష్యనులు ప్రవేశపెట్టిన లూనా 17 స్పేస్‌క్రాఫ్ట్ చంద్రగ్రహం మీద దిగింది. ఇది లూనాకోహోడ్ అనే స్వయంచాలక వాహనాన్ని (Self Propelled Vehicle) చంద్ర గోళం మీదికి పంపింది.

## మొట్టమొదట చంద్రగ్రహానికి దూరంగా అంతరిక్షశోధిని

మొట్టమొదట చంద్రగ్రహానికి దూరంగా అంతరిక్షశోధిని పయొనీర్ 5 స్పేస్‌క్రాఫ్ట్ యునైటెడ్ స్టేట్స్‌చే సౌర కుటుంబ పరిశోధనకు పంప బడింది.

## పిల్లలు - పళ్ళు

పిల్లల ఆరోగ్యానికి పళ్ళు అద్భుతమైనవి:

* ప్రతీరోజు పిల్లలకు ఆరెంజి రసం ఇస్తూంటే శీతాకాలంలో ఎటువంటి రోగాలు రావు.

* జర్మనీ బెర్లిన్ యూనివర్సిటీలో ప్రొ.మూర్ ఆపిల్ మీద ప్రయోగాలు చేసి పిల్లలకు సంభవించే అనేక రోగాలకు, ముఖ్యంగా జఠరరస సంబంధమైన రోగాలకు ఆపిల్ అమోఘమైనదని తెలుసుకున్నారు.

" బానిసకు బాధలు ఎక్కువ, స్వతంత్రుడికి బాధ్యతలు ఎక్కువ." -అమ్మ

# వనితాలోకం

## రుచికరము, హితకరము

కోసూరు శీలామాధవ్

మానవజన్మ చాలా ఉత్కృష్టమైనది. పుట్టిన మానవుడు తన ఆవశ్యకతను బట్టి అనుకూలంగా క్రొత్త క్రొత్తవి సృష్టించు కుంటూంటాడు. ఈవిధంగా ఏర్పడినదే మిక్కిలి హితకరము, రుచికరము మరియు సుఖకరము అయిన ఒక అమూల్యమైన వంటకం. ప్రతీరోజూ తెల్లవారి లేస్తే మొట్టమొదట అదే జ్ఞాపకం వస్తుంది. ప్రొద్దున్నే కాఫీతో పాటు పారణకి. దీనికి ఒకప్పుడు ఉడిపి హోటళ్ళు, కుంభకోణం రాయరు హోటళ్ళు ప్రసిద్ధి పొందినా ఇప్పుడు దక్షిణాదిని అన్ని రాష్ట్రాలలోను పోటీగా చాలా ప్రసిద్ధి పొందింది.

ఇదే ఇడ్లీ. అసలు దీనికి మూలపురుషుడు ఎవరో, ఇది ఎప్పుడు, ఎక్కడ పుట్టిందో మనకు తెలియదు. అది అంతా పరిశోధకుల పరిశ్రమ. ఈనాడు అంతర్జాతీయ ప్రఖ్యాతిపొందిన ఇడ్లీ అంతరిక్షంలోకి కూడా ప్రవేశిస్తుందంటే సందేహం లేదు.

దీనిని తెలుగులో ఇడ్డెన అంటాం. కన్నడంలో ఇడ్డళి, తమిళంలో ఇడ్డలి అంటారు. ద్రావిడ భాషలకు చెందిన ఈ పదాన్ని 'ఇడ్డాలికా' అని సంస్కృతీకరించారు. 'అవంతికా' అన్నది దీనికి సరైన సంస్కృత పదం.

ఉడికించిన వరిపిండి ఉండలుగా చేసి ఆవిరి మీద వండిన భక్ష్యం ఉండ్రకం, ఉండ్రాళ్ళు, కుడుములు, మోదకం అంటారు. వినాయకుడికి కుడుములు చాలా ఇష్టం. వినాయకుడు మోదక ప్రియుడు. మూయగట్టిన గుడ్డ (వాసెన) మీదపెట్టి వీటిని ఉడికిస్తారు.

తెలుగు ప్రాచీన గ్రంథాలు కాశీఖండం, బ్రహ్మోత్తర ఖండం మొదలైనవాటిలో దీని ప్రస్తావన కనిపిస్తుంది. ప్రాచీన కన్నడ గ్రంథాలలో దీనిని చేసే విధానం. వివరింపబడింది. పులియబెట్టిన మినపపిండిని చిన్న చిన్న పాత్రలలో పోసి వాసెన గట్టిన బట్ట మీద పెట్టి మూసి ఆవిరి మీద ఉడికించాలి. ఉడికిన తరువాత వాటిమీద మిరియాల పొడి జల్లి ఇంగువ, జీలకర్ర, ఆవాలు నేతిలో వేయించి వాటిమీద పోపు వేయాలి. అనుకూలాన్ని బట్టి రకరకాలుగా ఆకులలో పెట్టి, దొన్నెలలో పెట్టి ఆవిరిమీద వీటిని ఉడికిస్తారు.

## రాకాశి కుక్కగొడుగు



*మధ్య యుగొస్లేవియా (యూరప్) బోస్నియాలో 514 కి.గ్రా.లు తూగే ఒక పెద్ద రాకాశి కుక్క గొడుగు పెరిగింది. దీని కైవారం 13 మీటర్లు. దీనిని ఒక బాలుడు తన ఇంటి దగ్గర ఆడుకుంటూ కనుగొన్నాడు.*

"ఉన్నత లక్ష్యాలు లేనివారికి అల్పవిజయమే ఆనందం."

'ఒక క్రొత్త ఆహార పదార్థాన్ని అభివృద్ధి చేసినవారు క్రొత్త గ్రహాలను పరిశోధన చేసిన వారికంటే మానవ సౌఖ్యానికి ఎంతో ఉపకారం చేసిన వారవుతారు ' అని ఒక ఆంగ్లేయుడు చెప్పిన మాట ఈ ఇడ్లీకి అన్వయిస్తుంది. అప్పుడే వేడివేడిగా పొగలు వచ్చే ఇడ్లీల మంచిపరిమళము, రుచి అనుభవించ వలసిందే. చెప్పడానికి వీలుకాదు. ముఖ్యంగా వినాయకుడికి ప్రియమైన కుడుములు కొన్ని పదార్థాల చేర్పులు మార్పులతో పొందిన రూపాంతరమే ఇడ్లీ.

ఇడ్లీ ముఖ్యంగా ఆవిరి మీద ఉడికింది కాబట్టి దాంట్లో పౌష్టిక పదార్థాలు ఎంతమాత్రం నష్టం కావు. వేపుళ్లలో ఉండే చెడుగు ఇడ్లీలో ఉండదు.

హాస్పిటళ్లలో రోగులకు బ్రెడ్ బదులు ఇడ్లీలే ఇవ్వడం ప్రారంభించారు. వివిధ రోగులకే కాదు రెండు సంవత్సరాల చంటి పిల్లలకు మెత్తగా ఉండే ఇడ్లీలు సులభంగా జీర్ణం అవుతాయి. డయబెటిక్ రోగులకు రక్తంలో ఉండే చక్కెరపాలు బాగా తగ్గిస్తుంది. అందుకే మధుమేహ రోగులకు ఇది పథ్యం. ఆహార పదార్థాలలో B కాంప్లెక్స్ ప్రోటీను లోపం వల్ల సంభవించే లివరు వ్యాధులకు ఇడ్లీ ఎంతో ఆరోగ్యకరం.

మినపపిండి ఉడకబెట్టడానికి ముందు పులియబెడితే ఇడ్లీలు మెత్తగా, మృదువుగా ఉండటమే గాక బాగా ఉబ్బుతాయి. ఇడ్లీ పిండి ఫెర్మెంటు అయి పులిసినప్పుడే దానికి ఔషధ లక్షణాలు ఏర్పడతాయి. పులియబెట్టిన పిండిలో విటమిను B12, ఫోలిక్, రొనైన్, మెథోనైన్ ఆమ్లాలు ఉంటాయి. ఇడ్లీ రక్తంలో ఉండే ఎర్ర కణాలను పునరుజ్జీవింపజేస్తుంది.

దీనిని తయారు చేయడం చాలా సులభం. కావలసిన వస్తువులు 100 గ్రా.ల మినపప్పు (పొట్టుతో ఉంటే మంచిదే), ఒక చెంచాడు మెంతులు, 400 గ్రా.ల సన్నని బియ్యపు నూక (ఉప్పుడు బియ్యం ఉపయోగించవచ్చు). వీటిని విడివిడిగా నీటిలో 2 గంటలు నానబెట్టాలి. ఒక చిన్న చెంచాడు ఉప్పు, నానబెట్టిన మినపప్పు నానిన మెంతులు కడిగి శుభ్రంచేసి మెత్తగా బురుగులు వచ్చేదాకా (మిక్సీలో) రుబ్బుకోవాలి. నానబెట్టిన భియ్యం నూకను, నీళ్లు తీసివేసి మెత్తటి మినపప్పు రుబ్బిన పిండిలో గరిట జారుగా కలిపి ఉప్పు చేర్చి మూతబెట్టి ఉంచాలి. మరునటి రోజుకి ఇది బాగా పులిసి ఉబ్బుతుంది. ఈ పిండిని గరిటెతో కలిపి ఇడ్లీ కుక్కరులో ఉడికించుకోవచ్చు. లేదా పూర్వకాలపు ఇడ్లీ

## కాలేజీకి వెళ్లని ప్రసిద్ధులు


KAHLIL GIBRAN

*జోసెఫ్ చాంబెర్లైన్ - బ్రిటిష్ రాజనీతిజ్ఞుడు*
*అబ్రహాం లింకన్ - అమెరికా అధ్యక్షుడు*
*కహ్లిల్ గిబ్రాన్ - ప్రఖ్యాత సిరియా రచయిత, చిత్రకారుడు*
*రూడ్‌యార్డ్ కిప్లింగ్ - బ్రిటిష్ రచయిత*
*ఎర్నెస్ట్ హెమ్మింగ్వే - అమెరికా రచయిత*

" హింస ద్వారా సత్యాన్ని తెలుసుకోలేం,
అహింసతో సాధించలేని వసువు లేదు."
-గాంధీజీ

పాత్రలో గుడ్డమీద వేసి ఉడికించుకోవచ్చు. వేడివేడిగా తీసిన ఇడ్లీల మీద నేయి వేసుకుని తింటే చాలా రుచిగా ఉంటాయి. ఇష్టమైన వాళ్లు సాంబారు, కొబ్బరి పచ్చడి, అల్లపు పచ్చడి

తయారు చేసుకునే ఇడ్లీ ఇది. ఇక రకరకాల ఇడ్లీలు కూడా తయారు చేసుకోవచ్చు.

అటుకులతో ఇడ్లీలు: కావలసిన వస్తువులు: 200 గ్రాముల అటుకులు. ఒక చిప్ప కొబ్బరి కాయ, పులి పెరుగు, 10 పచ్చి మిరపకాయలు, కొత్తిమిరి, రుచికి తగిన ఉప్పు.
చేసే విధానం: అటుకులు బాగా నానబెట్టాలి. నానిన తరువాత కొబ్బరి కోరు, పచ్చి మిరప కాయలు, కొత్తిమిరి, ఉప్పు చేర్చి నున్నగా రుబ్బుకోవాలి. పుల్ల పెరుగు కలిపి ఇడ్లీ చేయడానికి అనుకూలంగా ఉండేటట్టు కలిపి ఇడ్లీ పళ్లెంలో పోసి ఆవిరి మీద ఉడికించాలి. రుచికి రుచి, ఆరోగ్యానికి ఆరోగ్యము.

కారట్ ఇడ్లీ: 1/2 కేజి కారెట్ దుంపలు, 50 గ్రా.లు పెసర పప్పు, 3/4 కేజి సన్నని రవ, కొద్దిగా పులి పెరుగు, ఒక కొబ్బరి చిప్ప, 10 పచ్చిమిరపకాయలు, కొద్దిగా కొత్తిమిరి, చిన్న అల్లం ముక్క, రుచికి తగినంత ఉప్పు.
చేసే విధానం: మొదట పెసరపప్పును నానబెట్టి, కారట్ దుంపలు కోరి ఉంచుకోండి. రవ్వను కొద్దిగా దోరగా వేయించి పచ్చి మిరపకాయలు, కొత్తిమిరి, అల్లం సన్నగా తరుగుకుని ఉంచాలి. కొబ్బరి కోరు సిద్ధంగా ఉంచుకోవాలి. వేయించిన రవ్వకి కారట్ కోరు, నానబెట్టిన పెసరపప్పు కలిపి తరిగి ఉంచిన పదార్థాలు, కొబ్బరి కోరు, ఉప్పు వేసి కలిపి ఇడ్లీ పళ్లెంలో పోసి ఉడకబెట్టాలి. ఇది చాలా త్వరగా తయారవుతుంది.

మసాలా ఇడ్లీలు: కావలసిన వస్తువులు: 200 గ్రాములు సన్నని బియ్యం నూక, 100 గ్రాముల శనగ పప్పు 100 గ్రాముల పెసరపప్పు, ఒక చిన్న కొబ్బరి కాయ, కొత్తిమిరి, 2 చెంచాల మిరియాలు, 10 పచ్చిమిరపకాయలు, రుచికి తగినంత ఉప్పు.
చేసే విధానం: పప్పులు బాగా నానబెట్టి వడగట్టి కొబ్బరి కోరు, మిరియాలు, కొత్తిమిరి, పచ్చి మిరపకాయలు, ఉప్పు అన్నీ చేర్చి మెత్తగా రుబ్బాలి. బియ్యం నూకను కొద్దిగా వేడి చేసి రుబ్బుకున్న రుబ్బులో నూక కలిపి ఇడ్లీ పిండిలా కలుపుకుని ఇడ్లీ పాత్రలో తయారు చేయాలి. తినడానికి చాలా రుచిగా ఉంటాయి. మధ్యాహ్నం లంచికి తీసుకు వెళ్ళడానికి అనుకూలంగా ఉంటాయి.

## వరి అధికంగా పండే రాష్ట్రాలు



*భారతదేశంలో వరి అధికంగా పండించే రాష్ట్రాలు వరుసగా-పశ్చిమబెంగాల్ (13 4%), ఉత్తర ప్రదేశ్ (12.4%), ఆంధ్ర ప్రదేశ్ (11 6%), బీహార్ (9.5%), పంజాబ్ (9.0%), తమిళనాడు (8.8%), ఒరిస్సా (7.8%). మొత్తం ఉత్పాదనలో ఈ రాష్ట్రాలది 73 శాతం. అస్సాం, కేరళ, మహారాష్ట్ర, హర్యానాలలో మొత్తం ఉత్పాదన 12 శాతం.*

*-పి. హెచ్.డి 'ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ' సౌజన్యంతో*

భూత భవిష్యత్తులు తెలిసినవారికి అంతా వర్తమానమే."

# ఎగబ్రాకే గ్రీన్ ఇగుఆనా

ఉషానాథ్

బల్లి, ఆనోల్, బాసిలిస్క్, కొమ్ముల బోదురు కప్ప మొదలైనవి చేరిన ఇగుఆనా (Iguana) కుటుంబానికి చెందినది. చెట్ల మీద నివసించే ఆకుపచ్చని ఉడుము (గ్రీన్ ఇగుఆనా) ఇగుఆనా కుటుంబంలో మిక్కిలి పెద్దది.



ఇగుఆనా సహజ పరిసరాలలో దక్షిణ అమెరికా మధ్య మరియు ఉత్తర ప్రదేశాలలో నివసిస్తుంది. గ్రీన్ ఇగుఆనా పాలిపోయిన ఆకుపచ్చ రంగులో ఉంటుంది. మగ ఇగుఆనాలకు ఆకుపచ్చని శరీరం మీద ఆరెంజి రంగు లేక పసుపువచ్చ రంగు ఛాయ ఉంటుంది. ఇవి ఆడవాటి కంటే పెద్దవిగా ఉంటాయి. తల మీద శిఖ పెద్దదిగా ఉంటుంది. మగ వాటికి ప్రతీతొడ క్రింద వరుసగా సూక్ష్మరంధ్రాలు ఉంటాయి.

శిఖ దువ్వెన పళ్లలాగా తల ప్రక్క నుంచి బయలుదేరి బలిష్టమైన మధ్యభాగం దాకా ఉంటుంది. వీటికి తోక ఒక రక్షక ఆయుధంలా పని చేస్తుంది. శత్రువులకు ఇది మారణాయుధం. కండపుష్టితో పదునైన అంచులతో బలిష్టంగా ఉండే తోకతో కొట్టే కొరడా దెబ్బలకు శత్రువులు భయపడి పారిపోతాయి. ఇంట్లో బల్లులు లాగే ఇగుఆనా కూడా ఆత్మరక్షణ కోసం తోకను విడిచేస్తూంటుంది. తోక తిరిగి పెరుగుతుంది కానీ పదునైన అంచులు ఉండవు.

గ్రీన్ ఇగుఆనా చాలా నైపుణ్యంగా చెట్లమీదికి ఎక్కుతుంది. బాగా పెరిగినవి సాధారణంగా చెట్లమీదే ఉంటాయి. వీటి ఆకుపచ్చని శరీరం చెట్ల ఆకులలో కలిసిపోయి శత్రువులకు సాధారణంగా కనిపించదు. చెట్లు బాగా దట్టంగా అల్లుకుపోయి సాధ్యమైనంత పట్టు ఉన్నచోట ఇది ఒక చెట్టుమీది నుంచి మరో చెట్టుకు పాకిపోతుంది. ఇగుఆనాలు చాలా దూరం గెంతలేకపోయినా గ్రీన్ ఇగుఆనాలు 15 మొదలు 18 మీటర్లు ఎత్తుగా ఉండే కొమ్మల మీదినుంచి భూమి మీదికి ఉరుకుతాయి. తరచుగా ఇగుఆనాలు నీటిలో దాక్కుంటాయి. ఇవి సాధారణంగా నదులు, చెరువులు గట్లమీద ఉండే చెట్లమీద ఉంటాయి.

## మానవుడు - ప్రకృతి

అసలు మానవుణ్ణి ప్రకృతి జయించగా ప్రకృతిని జయించానని మానవుడు అంటాడు. తాత్కాలికంగా ప్రకృతి మానవుని సృష్టించింది. తన విజ్ఞానాన్ని కొంత ఇచ్చింది. ప్రతీరోజు ప్రయోగాలు చేసి అనుభవంతో (తరచుగా తప్పుడు) ప్రకృతిని తెలుసుకోడానికి ప్రయత్నిస్తున్నాము. మన సిద్ధాంతాలు కాలం చెల్లుతూన్న కొద్దీ మారుతూంటాయి అనేదే దీనికి సాక్ష్యం. మహాభారతంలో యుధిష్ఠిరుడు 'ప్రపంచం అజ్ఞానంతో కప్పబడి ఉంది' అన్నాడు. నేడు విజ్ఞానం మనిషిని తప్పుతోవ పట్టిస్తూంది. విశ్వరహస్యం జటిలమైనది.

ప్రొ.ఎస్.శ్రీకంఠయ్య- తపోవన్ ప్రసాద్ సౌజన్యంతో

ఇవి జతకూడే కాలంలో ప్రతీ మగ ఇగుఆనా ఒక రాతి మీదనుంచి పరీక్షిస్తూంటుంది. ఇంకో మగది ఏదైనా వస్తూంటే బలవంతంగా దానిమీద పడుతుంది. ముట్టె పైకి క్రిందికి ఎత్తి ఛాలెంజి చేసినట్టు ఆడిస్తుంది. దీనితో భయపడి వెళ్లిపోక పోతే పరస్పరం పోరాటం ప్రారంభం అవుతుంది. కాళ్లమీద వదులుగా ఉండే చర్మాన్ని పరస్పరం పీక్కుంటాయి.

ఆడ ఇగుఆనాలు మగవాటి బొరియలలో నివసిస్తాయి. లేకపోతే ప్రక్కన ఉండే బొరియలలో నివసిస్తాయి. జత కూడిన తరువాత ప్రతీ ఆడది నదిగట్లమీద గొయ్యి త్రవ్వి అందులో సుమారు 20-70 గ్రుడ్లకు పైగా పెడుతుంది.

నాలుగు సెంటీమీటర్ల కైవారంతో గుండ్రంగా ఉండే గ్రుడ్లు మూడు మాసాల కాలంలో పొదగ బడతాయి. ఇవి పొదగడానికి నిలకడగా 30° సెల్షియస్ ఉష్ణోగ్రత ఉండాలి.

చిన్న ఇగుఆనాలు పుట్టినప్పుడు 25 సెం.మీ.ల పొడవు ఉంటాయి. రెండు సంవత్సరాలలో ఇవి రెండు మీటర్ల పొడవుగా పెరుగుతాయి. పెరిగిన పెద్ద ఇగుఆనాలు రకరకాల పళ్లు, కాయలు, చిగుళ్లు, ఆకులు తింటాయి. చిన్నవి అప్పుడప్పుడు కీటకాలను కూడా తింటూంటాయి.

దక్షిణ అమెరికాలో కొన్ని ప్రాంతాలలో ప్రజలు ఇగుఆనా మాంసం ఇష్టంగా తింటారు. సాధారణంగా వీటి మీద పడి చంపే డేగలలాగా అరచి భయపెట్టి వీటిని వేటాడతారు. ఈ అరుపులకు అవి భయపడి ముడుచుకుపోతాయి. వేటగాళ్లు సులభంగా పట్టుకుంటారు. అడవులలో చెట్లను మేకలు తినివేయడం వల్ల చిన్న ఇగుఆనాలకు రక్షణలేక డేగలు సులభంగా పట్టుకుంటూంటాయి.

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

# ఆరోగ్య సూత్రాలు



* సమతూకపు పుష్టికరమైన మరియు తక్కువ క్రొవ్వు గల పదార్థాలను తక్కువ పరిమాణంలో తరచు తింటూండు.

* గుండెపోటుకు లేక కాన్సర్‌కు ముఖ్య కారణమైన సిగరెట్టు కాల్చకు. అది ఆయుస్సును క్షీణింప జేస్తుంది.

* ఆరోగ్యకరంగా ఉండడానికి నడక ఉత్తమమైన మార్గం. టానిక్‌లు కంటే మంచి శుభ్రమైన గాలి ఆరోగ్యానికి ఎంతో ముఖ్యం.

* నీ జీవితం, ఇతరుల జీవితం కూడా మంచి దృష్టి, మంచి మనస్సు మీద ఆధారపడి ఉంటాయి.

* ఆటలు ఆరోగ్యానికి చాలా ముఖ్యం. ఆటల వల్ల ఇతరులతో క్రొత్త క్రొత్త స్నేహాలు ఏర్పడతాయి. ఈత, 'ఫిట్‌నెస్' వ్యాయామం అందరూ అనుసరించాలి.

* నిద్రమాత్రలు, ఒత్తిడి తగ్గించే మాత్రలు ఉపయోగించడం మానుకో.

—'స్వస్థ్‌హింద్' సౌజన్యంతో

'పట్టుదల ఉన్నవాళ్లు మార్గం కనిపిస్తుంది, సృష్టించుకుంటారు."

# మీకు తెలుసా?

## భూమిపైన సూర్యోదయం

భూమిమీద సోవియెట్ ఫార్ ఈస్ట్ (యు.ఎస్.ఎస్.ఆర్.) ప్రదేశంలో ప్రతీరోజూ సూర్యోదయం మొట్టమొదట కనిపిస్తుంది.

## మొట్టమొదటి ఆధునిక ఒలింపిక్స్



మొట్టమొదటి ఆధునిక ఒలింపిక్స్ 1896 లో గ్రీసు ముఖ్యపట్టణమైన ఏథెన్స్‌లో నిర్వహించబడ్డాయి.

## మొట్టమొదటి ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా

మొట్టమొదట ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా 1768 డిసెంబరులో స్కాట్లండ్ ఎడిన్‌బర్గ్‌లో ప్రచురింపబడింది.

## అంటార్కిటికాలో మొదటి భారత సాహసయాత్ర

మొట్టమొదటి భారతీయ సాహసయాత్ర అంటార్కిటిక్ ఖండం మీద జనవరి 9, 1982న సరిగ్గా 0030 గంటలకు (ఐ.ఎస్.టి) దిగింది.



1981 డిసెంబరు 6 వ తేదీన నార్వే నుంచి వచ్చిన 'పోలార్ వలయం' అనే ఓడలో గోవా నుంచి బయలుదేరి మారిషస్ మీదుగా అంటార్కిటికా చేరారు.

## విక్టోరియా మహారాణి మొట్టమొదటి ప్రైవేట్ టెలిఫోన్ కాల్ చేసింది

1878 జనవరి 14 న బ్రిటన్‌లో విక్టోరియా మహారాణి మొట్టమొదటి ప్రైవేట్ టెలిఫోన్ కాల్ చేసింది.

"భోగభాగ్యాల ఆనందానుభూతిని ఆశించేవారు జనన మరణ చక్రం నుంచి తప్పించుకోలేరు."

# జీవితంలో హాస్యం

జె. షీలా ఆనీ

హాస్యం అనేది మనిషి దైనందిన జీవితంలో మనస్సును తేలికగాను, తేటగాను ఉంచడానికి ఒక ఆలంబన. అది మనిషికి సంతోషం కలిగిస్తుంది. పరిహాసం వేరు, హాస్యం వేరు. అదేవిధంగా చమత్కారం వేరు, హాస్యం వేరు. రెండూ ఒకటి కావు. హాస్యం



అటు పరిహాసానికి, ఇటు చమత్కారానికి మధ్య ఉంటుంది. చమత్కారంలో ఉండే ప్రతిభా, పాండిత్యం, పరిహాసంలో ఉండే వినోదం హాస్యంలో చేరి ఉంటాయి.

మనిషి జీవితంలో హాస్యం ఊపిరి వంటిది. తప్పనిసరిగా ఉండి తీరాలి. ఇది లోపించినప్పుడు మనిషి నిత్య జీవితంలో కలుగుతూన్న ఒత్తిడులను, ప్రయాసలను తట్టుకోలేడు. యాతనామయమైన సంక్షోభ మార్గం వీడి మనస్సు శాంతియుతమైన ఆనంద మార్గాన్ని పట్టుకునేటట్టు చేస్తుంది. విసుగుదల, చిరాకు కలిగించే ఆహ్లాదకరం కాని విషయాన్ని రసవంతం చేస్తుంది. సరళతతోనూ, హాస్యంతోనూ కూడిన ప్రసంగం ఎక్కువ ఆహ్లాదకరంగా ఉంటుంది. చెప్పే విషయాలను శ్రోతలు విశ్లేషించి అవగాహన చేసుకోడానికి ప్రయత్నం చేయవలసిన అవసరం ఉండదు. బ్రిటన్ దేశపు మాజీ ముఖ్యమంత్రి సర్‌విన్‌స్టన్ చర్చిల్ తన హాస్యంతో తీవ్రమైన రాజకీయ విరోధులను లొంగదీసుకుని వివిధ దేశాలలో ప్రజాగౌరవాన్ని పొందాడు. ఒకసారి ఒక యువక పత్రికా విలేఖరి 'రాజకీయ తంత్రజ్ఞుడుగా రాణించాలంటే ఉండవలసిన అర్హత ఏమిటి' అని చర్చిల్‌ను ప్రశ్నించాడు. 'రేపు, వచ్చే వారం, వచ్చే నెల, వచ్చే సంవత్సరం ఏం జరుగబోతుందో ముందుగానే చెప్పగలిగి, తరువాత ఎందుకు సంభవించలేదో వివరించగల సామర్థ్యం కలిగి ఉండాలి' అని చర్చిల్ అన్నాడు. జీవితంలో నానాయాతనలు అనుభవించిన రాజకీయ తంత్రజ్ఞుడు చర్చిల్ తన ప్రతి

## మార్కస్ ఆరీలియస్ సూక్తులు

సంభాషణలోగానీ, ఉత్తరాలలోగానీ 'నాకు తీరిక లేదు' అనేమాట తరుచు వాడకు.

నీవు చేయవలసిన ధర్మాలను నెమ్మదిగా ఆర్భాటం లేకుండా ఆచరించు.

నీవు విశ్వసించిన విధంగా మాట్లాడు. నీవు న్యాయం అనుకున్నట్టుగా చేయి.

" వివేకశూన్యమైన న్యాయం అసంభవం."

పక్షనాయకులు ఏ విధంగా ప్రవర్తిస్తారో హాస్య ధోరణిలో వివరించాడు.

ఏ సాహిత్యరంగంలోనైనా, ఉత్తమ హాస్యకారులందరూ ఉత్తమ వ్యాస రచయితలే. ఆంగ్ల భాషలో ప్రఖ్యాత వ్యాస రచయితలు— ఇ.వి. లూకాస్, రాబర్ట్ లిండ్ మరియు ఎ.జి. గార్డినర్ మొదలైన వారందరూ సమాజంలో వ్యాపించి పోయిన దుర్నీతి ఫలితాలను సున్నితమైన హాస్యంతో ప్రజానీకానికి వెల్లడి చేసారు. ఛార్లెస్ లాంబ్, ఎ.పి. హెర్బర్ట్ మరో ఇద్దరు సుప్రసిద్ధ హాస్య రచయితలు. వీరు ఎక్కడబడితే అక్కడ ఎప్పుడు బడితే అప్పుడు నలుగురూ తలుచుకుని నవ్వుకోగల హాస్య రచనలు కొనసాగించారు. లోవెల్ మరియు హెరామ్స్ (Holmes) వంటి ప్రజ్ఞావంతులైన పండితుల రచనలలో హాస్యం ముఖ్య పాత్ర వహిస్తుంది. థోరో విమర్శనాత్మకమైన వివేకానికి, హాథార్న్ కల్పనలకు హాస్యం ఒక నవ్య ధోరణిని కల్పించింది. బ్రెట్ హార్టే, మార్క్‌ట్వైన్ వంటి ప్రతిభాశీలుర రచనలలో ఇది ఉత్తమ స్థాయిని అందుకుంది.

ఉత్తమ తరగతికి చెందిన హాస్యం సమాజంలో ఒకరు ధరించే మంచి రకపు దుస్తుల వంటిది. హాస్యధోరణిలేని మనిషికి అపాయం లేకపోయినా పలుకుబడి మాత్రం తగ్గక మానదు. కమనీయమైన హాస్యం మనస్సుకు వికాసం కలిగిస్తుంది. జీవితంలో కలిగే ఒడుదుడుకులలో, నిరాశల చెలగాటంలో చిక్కుకు పోయినప్పుడు మానవునికి ఆనందాన్ని, ఆరోగ్యాన్ని, వినోదాన్ని ఇవ్వగలిగేది హాస్యం మాత్రమే. తాను హాయిగా జీవిస్తూ చుట్టూ ఉన్నవారి బ్రతుకులను నందనవనాలుగా చేయగలిగే చతురులు హాస్యాన్ని అభిలషిస్తారు. హాస్య విరహితమైన జీవితం దుర్భరం, జాతి జీవనం భయంకరం.

## పక్వం చెందడానికి కాలం తీసుకుంటుంది



ప్రకృతిలో ప్రతీది నెమ్మదిగా జరుగుతుంది. ఒక మొక్క పెరిగి బ్రహ్మాండమైన వృక్షంగా పెరగడానికి కొన్ని సంవత్సరాలు పడుతుంది. మొట్టమొదట పట్టణాలు అభివృద్ధిపొందడానికి కొన్ని శతాబ్దాలు పట్టింది. మహోన్నతమైన పర్వతాలు, నదులు ఏర్పడడానికి మిలియనుల కొద్దీ సంవత్సరాలు పడుతుంది. ప్రకృతికి తొందరపాటు లేదు. మానవుడే ప్రపంచంలోకి వేగిరపాటును తీసుకు వచ్చాడు. పెద్ద పెద్ద నగరాలలో నివసించేవారు హడావిడికి లొంగి బానిసలై పోతారు. అంతా వడి వడిగా జరిగిపోతుంది. ఊపిరి తీసుకోవడం, అన్నం తినడం, మాట్లాడటం, వ్రాయడం, చదవడం అన్నీ తొందర తొందరగా జరిగిపోతాయి. పువ్వులు అతిమెల్లగా వికసించినట్లు, నదులు మెల్లి మెల్లిగా ప్రవహించినట్లు ఏదీ మెల్లిగా జరుగదు.

సావకాశంగా చేయడానికి అలవాటు చేసుకో. పళ్లైనా, రాజ్యాలైనా, పెద్ద పెద్ద యోజనలైనా పక్వం చెందడానికి కాలం తీసుకుంటుంది.

—హెచ్. స్పెన్సర్, 'ఆర్ట్ ఆఫ్ లివింగ్' సౌజన్యంతో

"ఏకాంతంలోనే ఎవరి తాహతు వారికి తెలుస్తుంది."

# యువతకు రామాయణం నేర్పాలి

టి.ఎల్.వాస్వాని

మన దేశంలో విద్యార్థులు శ్రీరామచంద్ర మూర్తిని ప్రాచీనకాలపు చారిత్రక పురుషునిగా గాక భావికాలపు దివ్యచిహ్నంగా తెలుసుకోవాలి. శ్రీరామచంద్రమూర్తి ఆర్య సాంప్రదాయపు ఆధ్యాత్మికత కూడిన ధార్మిక జీవితానికి ఆదర్శ పురుషుడు.



భారతదేశపు యువతకు రామాయణం నేర్పాలి! వారి శీలాభివృద్ధికి అది సహకరిస్తుంది. ఆర్యజాతిని గురించి నూతన అభిప్రాయాలు తెలుస్తాయి. ఆ జాతి ఆదర్శాలు, శక్తి సామర్థ్యాలు విశదమవుతాయి. శ్రీరాముడు లోకాలకు ఆదర్శ చక్రవర్తి! అతడిది శౌర్యముతో కూడిన సౌశీల్యము.

శ్రీరాముడు సర్వ రాజ్యాధికారాన్ని వదలుకున్నాడు. రాముడు రావణుని జయించాడు. లంకలో అందరూ రాముని పాదాలపై పడ్డారు. కానీ ఆ రాజ్యంలో ఒక అంగుళం మేర ఆశించలేదు. విభీషణునికి పట్టం కట్టి, లంక సింహాసనంపై కూర్చుండబెట్టాడు. తాను అయోధ్యకు మరలివచ్చాడు. నెపోలియన్ కంటే ఎంత గొప్పవాడో!

శక్తి సంపన్నుడైన నెపోలియన్ గంభీరమైన వ్యక్తి. గొప్ప అదృష్టవంతుడు. నెపోలియన్‌ను చూచి రాజులు గడగడ వణికిపోయేవారు. సింహాసనాలు - కదిలిపోయేవి. ఆధునిక యుగంలో ప్రపంచపు గొప్ప వీరుడైన లెనిన్ తరువాత అంతటి వీరుడు నెపోలియన్. కానీ నెపోలియన్ రాముడికి తీసిపోతాడని నేను విశ్వసిస్తాను. నెపోలియన్‌కి శక్తి ఉంది. రామునికి శక్తి ఉంది. రామునిది దివ్యశక్తి. నెపోలియన్ అహంకారి. రాముడు వినయమూర్తి. శ్రీరాముడు గొప్ప తపశ్శాలి.

## 1981 నాటి వార్త

## కేసు పరిష్కారానికి 28 సంవత్సరాలు!

*ఒక కేసులో తీర్పు చెప్పడానికి ఢిల్లీ కోర్టుకి 28 సంవత్సరాల దీర్ఘ కాలం పట్టింది. 1952 డిసెంబరులో ఒక భవన నిర్మాణ కంట్రాక్టరు జామియా మిలియా ఇస్లామియా యూనివర్సిటీ పైన సుమారు రూ. 49,000 ల సొమ్ము చెల్లించనందుకు ఒక సివిల్ కేసు దాఖలు చేసాడు. ఇది మొత్తం 15 న్యాయాధికారుల విచారణకు వచ్చింది. 15 మంది వివిధ న్యాయవాదులు వాదించారు. ఆర్గ్యుమెంట్లు 900 పుటలు, సాక్ష్యాలు 2,300 పుటలు వ్రాయబడ్డాయి. చివరగా తీర్పు 144 పుటలు వ్రాయబడింది.*

"పొగడేవాడు పక్కలో బల్లెం వంటివాడు."

నెపోలియన్ జీవితం, అతడి ప్రేమ వ్యవహారాలు తెలుసుకుంటే నెపోలియన్, తపోనిధి అయిన శ్రీరామునితో ఎందునా సరిపోల్చ తగనివాడని తెలుస్తుంది. సామాన్య మానవులలో ఒక వ్యక్తిగా పరిగణించినప్పుడు శ్రీరాముని వినయశీలత తెలుస్తుంది. ఎంత గంభీరమో అంత సామాన్య ప్రేమానుభూతితో ప్రకాశిస్తూంటాడు. నెపోలియన్ గొప్ప విజయ వీరుడు. శ్రీరాముడు ఉదారస్వభావుడు. శ్రీరాముడు చక్రవర్తి లక్షణాలతో కూడిన గొప్ప మౌని.

'రామ' అంటే సౌందర్యం అనే అర్థం ఉంది. రాముని సౌందర్య రహస్యం ఎక్కడ ఉంది? అతడి తపోనిష్టలో. తన వారిని వదలిరావడమే అతడి సౌందర్యమైన సాధు జీవితం.

శ్రీరాముడు 14 సంవత్సరాలు వనవాసం చేసాడు. ఒక వనం నుండి మరో వనానికి వెడతాడు. రాముని దివ్య జీవితం రామాయణంలో సంస్కృత శ్లోకాలలో వర్ణించబడింది. శ్రీరాముని వనవాసం హృదయవిదారకంగా ఉంటుంది. ఈ వనవాసం దీర్ఘకాలవు కన్నీటిగాథ. రాముని వనవాసం రాముని జీవితానికి ఒక శోభను కలిగించింది. అయోధ్యకు తిరిగివచ్చాడు. సింహాసనం అధిష్ఠించాడు. క్రొత్త అనుభవంతో సంపన్నుడైనాడు.

తపశ్శీలురైన మహాత్ములు అపూర్వఘట్టాలను సృష్టించినట్లు చరిత్రవల్ల తెలుస్తుంది. చరితార్థులైన దివ్యపురుషులు ధర్మానికీ, సత్యానికీ జీవించారు. కష్టాలు అనుభవించడంలో ఓర్పు ఉంది. ఇదే విజయానికి విలువైనమార్గం. శ్రీరాముడు జయించాడు. సీతను శ్రీరాముడు త్యాగశీలంతో రక్షించాడు. సీత భూమి నుండి జన్మించినది. గొప్ప పతివ్రతగా నిరూపించబడింది. భూమి రావణుని క్రూరహస్తాలలో ఉంది. ఆధునిక జీవితంలో సుఖం, అహంకారం అనే రెండు దుర్గుణాలతో రావణుడు నిరూపింపబడ్డాడు. నాగరికత సుఖం, అహంకారం చేతులలో చిక్కుకుపోయింది. ప్రపంచాన్ని రావణుని చేతుల నుండి రక్షించి ఒక నవ్యనాగరికతను నిర్మించడానికి నిష్కామత్వము, ఇంద్రియ నిగ్రహము గల వీరుని ఆవశ్యకత ఏర్పడింది.

## హబుల్ స్పేస్ దూరదర్శినితో మొట్టమొదటి ఫోటో




*ప్రస్తుతం భూమికక్ష్యలో తిరుగుతూన్న హబుల్ స్పేస్ దూరదర్శిని మొట్టమొదటిసారిగా ఇతర గలాక్సీలలో పెద్ద నక్షత్రాల వివరణాత్మక దృశ్యాలను ఇచ్చింది. 30 డొరాడుస్ అనే నక్షత్రాల గుంపు ఫోటో ఆగస్టు 3న దూరదర్శినిలో అమర్చిన వైడ్ ఫీల్డ్ అండ్ ప్లానెటరీ కెమెరాతో తీయబడింది. 30 డొరాడుస్ భూమికి 160,000 కాంతి సంవత్సరాల దూరంలో ఉంది. హబుల్ తీసిన R 136 అనే మరో నక్షత్రాల గుంపు ఫోటోలో స్పష్టంగా 60 నక్షత్రాలు కనిపిస్తాయి. ఇటీవల 10 సంవత్సరాల ముందే ఈ గుంపులో ఒకే నక్షత్రం ఉన్నట్టు భావించబడింది.*

—అఫ్జల్ ఖాన్

—'యునైటెడ్‌స్టేట్స్ ఇన్ఫర్మేషన్ సర్వీస్' సౌజన్యంతో

# నిజాలు - నిదర్శనాలు

## సాలీనా 200,000 ప్రమాదాలు

భారతదేశంలో విస్తరించుకున్న 17 లక్షల కిలోమీటర్ల రోడ్లమీద తిరిగే 70 లక్షలకు పైబడిన మోటారు వాహనాలు సాలీనా 200,000 ప్రమాదాలకు కారణమవుతున్నాయి.

* * *

## టెలిఫోనులైనుకి ఖర్చు

ప్రపంచంలో టెలిఫోనులైను మీది వ్యయం భారతదేశంలో మిక్కిలి తక్కువ. భారతదేశంలో



లైనుకి రూ. 15,000 ఖర్చు అయితే యునైటెడ్ స్టేట్స్ రూ. 60,000 ఖర్చు చేస్తుంది.

## విద్యుచ్ఛక్తి ఉత్పాదక సమర్థత

భారతదేశంలో 30 సెప్టెంబరు, 1990 నాటికి స్థాపించబడిన విద్యుచ్ఛక్తి ఉత్పాదక సమర్థత 64,000 MW. 31 మార్చి 1990 నాటికి స్థాపింపబడిన జలవిద్యుచ్ఛక్తి ఉత్పాదక సమర్థత 18,307 MW.

* * *

## లక్ష జనాభాకి 187 నేరాలు

ఇప్పుడు భారతదేశంలో లక్ష జనాభాకి 187 నేరాలు సంభవిస్తున్నాయి. దీనిలో నాలుగు శాతం 16 మొదలు 21 సంవత్సరాల వయస్సువారి బాలనేరాలు: అంటే ఒక లక్ష జనాభాకి 7.7 నేరాలు బాలనేరాలు అన్నమాట.

# సుభాషితాలు

*మర్మవిధుడు గాని మర్మంబు గనలేడు*
*కర్మ జీవిగాని కానలేడు*
*నీరు చొరక లోతు నిజములు తెలియునా*
*విశ్వదాభిరామ వినురవేమా!*
*[విద్వాంసుని జ్ఞానాన్ని విద్వాంసుడే తెలుసుకో గలడు. కర్మజీవిని కర్మజీవియే తెలుసుకో గలడు. నీటిలో దిగిన వానికే నీటిలోతు తెలుస్తుంది.]*

*నరుడయినను లేక నారాయణుండైన*
*దత్త్వబుద్ధుడైన ధరణి నరయ*
*కర్మభావములను ఘనత నొప్పగవలె*
*విశ్వదాభిరామ వినురవేమా!*
*[నరుడైనా, నారాయణుడైనా, తత్త్వవేత్త అయినా అందరూ కర్తకు లొంగి ఉండ వలసినదే.]*

" ఎంతటి బలవంతులైనా స్వలాభాపేక్ష ఉంటే బల హీనులైపోతారు."

## ఇంజనీరింగ్ పరిశ్రమలలో ఉద్యోగావకాశాలు

28.6 శాతం ఇంజనీరింగ్ పరిశ్రమలు వహిస్తూంటే,



కాటన్ టెక్స్‌టైల్స్ 13.4 శాతం, ఆహారోత్పాదన 13.1 శాతం, కెమికల్స్ మరియు వాటితో తయారయే వస్తువులు 6.4 శాతం, కాగితం మరియు కాగితపు వస్తువులు 3.6 శాతం వహిస్తున్నాయి.

'కాన్ ఫెడరేషన్ ఆఫ్ ఇంజనీరింగ్ ఇండస్ట్రీ'

## పోస్టుకార్డుల మీద ఖర్చు రూ. 75 కోట్లు

1989 - 90 సంవత్సరంలో పోస్టల్ డిపార్ట్ మెంట్ వారి నష్టాలు మొత్తం రూ. 200 కోట్లు. సాలీనా పోస్ట్ కార్డులమీద రూ. 75 కోట్ల నష్టం ఏర్పడుతూంది.

## ఆటో టైర్ ఫాక్టరీలు

భారతదేశంలో 150 మధ్య తరహా మరియు 5,000 చిన్న తరహా రబ్బరు సామాగ్రి సంస్థలు, 22 ఆటో టైర్ పరిశ్రమలు 2.75 లక్షల మందిని నియోగించి రూ. 4,500 కోట్లు లాభం సంపాదిస్తున్నాయి.

* * *

## ఆటసామాన్ల ఎగుమతి

1989-90 సంవత్సరంలో భారతదేశపు ఆట సామానుల (Sports goods) ఎగుమతి రూ. 79 కోట్ల రికార్డు స్థాయిని అందుకుంది. భారతదేశం 90 పైగా వివిధదేశాలకు ఆట సామానులను ఎగుమతి చేస్తూంది. దీనిలో 70 శాతం ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జ ఎగుమతి చేయబడుతూంది.

## తగ్గిపోతూన్న చిల్కానరస్సు

*ఆసియాలో మిక్కిలి పెద్ద ఉప్పునీటి సరస్సు చిన్నదైపోతూంది. ఒరిస్సాలో చిల్కానరస్సు మేట వేసుకుపోవడంవల్ల ఉజ్జాయింపుగా సంవత్సరానికి 1.4 చ.కి.మీ.ల వైశాల్యం తగ్గిపోతూంది. సాలీనా 14 చ.కి.మీ.లు మేర కలువు పెరిగిపోతూంది. మేటవేసుకుపోవడంవల్ల, కలువు పెరగడం వల్ల నీటివైశాల్యం తగ్గిపోతూంది. నీటి ఉప్పదనం తగ్గిపోతూంది. దీనివల్ల జీవావరణ సమతౌల్యత చెడిపోతూంది.*

*అనేక సమస్యలతో (ముఖ్యంగా చేపలను విస్తారంగా పట్టడం) కూడిన చిల్కానరస్సు ఇప్పటికీ వివిధ రకాల నీటిపక్షులకు ఆశ్రయమిస్తూంది. ప్రస్తుత రేటులో తగ్గిపోతూంటే ఇక 400 సంవత్సరాలలో ఇది పూర్తిగా ఎండిపోతుందని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.*

—'హార్న్‌బిల్' సౌజన్యంతో

" నీవు అనుభవించే సుఖసౌభాగ్యాలే అందరికీ ఉండాలని కోరుకోవడం సమాజ ధర్మం."

## యురేనియం, థోరియం వనరులు

భారతదేశంలో అంచనా వేయబడిన యురేనియం వనరులు 73,000 టన్నులు. ఇది 30 సంవత్సరాలవరకు ఏటా 10,000 MW అణుశక్తి ప్రణాళికకు సరిపోతుంది. దీనికి తోడు ఇకముందు ఫాస్ట్ బ్రీడర్ రియాక్టర్లకు అణుఇంధనంగా ఉపయోగించడానికి వీలైన థోరియం వనరులు భారతదేశంలో 3,20,000 టన్నులని అంచనా వేయబడింది.

## ఇంజనీరింగ్ సాధన సదుపాయాల ఎగుమతి

దక్షిణప్రాంతాలలో 1989-90 సం.లో మొత్తం రూ.168.65 కోట్ల విలువ గల ఇంజనీరింగ్ సాధనసదుపాయాలు ఎగుమతితో కర్ణాటకా ప్రథమస్థానం పొందుతూంది. దీని తరువాత రూ. 150.41 కోట్ల విలువతో తమిళనాడు ద్వితీయస్థానాన్ని పొందుతుంది.

* * *

## 10 మిలియను మందికి కాటరాక్టు

భారతదేశంలో ప్రస్తుతం 10 మిలియను మందికి పైబడి కాటరాక్టు రోగులు శస్త్రచికిత్సకు సిద్ధంగా ఉండగా సాలీనా 750,000 అదనంగా చేరుతున్నారు.

* * *

## సగానికి సగం మందికి పాదరక్షలు

భారతదేశపు 800 మిలియను జనాభాలో సగం మందికి పాదరక్షలు లేవు. దేశంలో ప్రతీ సంవత్సరం 350 మిలియను జతల జోళ్లు తయారుచేస్తారు. దీంట్లో 25 శాతం మెషీను మీద తయారైనవి. చైనాలో 1,900 మిలియను జతలు, సోవియెట్ యూనియన్‌లో 1,030 మిలియను జతలు, తైవాన్‌లో 809 మిలియను జతలు మెషీన్‌మీదే తయారవుతున్నాయి. భారతదేశంలో తయారయే 350 మిలియను జతలలో 30 మిలియను జతలు మాత్రమే మూలు. మిగిలినవి శాండల్స్ మరియు స్లిప్పర్సు.

## ధైర్యం - ఉత్సాహకరము సృజనాత్మకము


SWAMI CHINMAYANANDA

*ఏ కార్యమైనా తీవ్రమైన పట్టుదలతో ప్రయత్నిస్తే విజయం సిద్ధించక మానదు. ఈ విధంగా మనో నిశ్చయం గౌరవప్రదమవుతుంది. దురుద్దేశానికి వినియోగిస్తే అది మొండితనం అవుతుంది! రెండూ పట్టుదలతోను, శ్రమతోను కూడినవే. కానీ మనోనిశ్చయం ఔత్సాహికము. సృజనాత్మకము. మొండితనం ఋణభావంతో విధ్వంసాత్మకంగా ఉంటుంది. రెండూ నీ అధీనంలో ఉన్నాయి. వివేకంతో ఆచరించు.*

—స్వామీ చిన్మయానంద

" లేనప్పుడే కాదు, ఉన్నప్పుడు కూడా పొదుపును గురించి ఆలోచించాలి."

# అడవి పిల్లి

రాజీవ్ మార్వా

ఉత్తరం హిమాలయాల పర్వత ప్రదేశం నుంచి దక్షిణం కన్యాకుమారి వరకూగల అడవి ప్రదేశాలలోనూ, ఇతర చిట్టడవులలోనూ అడవిపిల్లులు కనిపిస్తాయి.



ఇళ్లలో పెంపుడు పిల్లులకంటే చాలా పెద్దదిగానూ, సన్నగానూ ఉండే అడవి పిల్లికి తోక చాలా చిన్నదిగా ఉంటుంది. కాళ్లు మిక్కిలి పొడవుగా ఉంటాయి. సుమారు అయిదు మొదలు ఆరు కిలోగ్రాముల భారం తూగుతుంది. శరీరం పొడవు 60 సెం.మీ.లు. తోక 30 సెం.మీ.ల పొడవుగా ఉంటుంది. భుజాల దగ్గర 35 సెం.మీ.లు ఎత్తుగా ఉంటుంది.

అడవి పిల్లులు ఇసుకగోధుమ వర్ణంలోను, పసుపు నిగ్గు తేలిన గోధుమ వర్ణంలోనూ ఉంటాయి. క్రింది కడుపు భాగం మాత్రం పాలిపోయిన రంగులో ఉంటుంది. చివర నల్లగా ఉండే తోకక్రింది భాగంలో నల్లటి వలయాలు ఉంటాయి. శరీరంమీద అడ్డంగా మచ్చలు కెరటాలులాగా వంపులు తేరి ఉంటాయి. కొన్నిరకాలలో తోకమీద తప్ప ఇతర శరీర భాగంమీద మచ్చలు ఉండవు.

వీటిచెవుల మధ్య వెలసినరంగులో ఒక మచ్చతో ఎర్రగా ఉంటాయి. చెవులక్రిందిభాగంలో నల్లటి వెంట్రుకలు నిక్కబొడుచుకుని ఉంటాయి. లేత ఆకుపచ్చరంగుగల కళ్లతో మిక్కిలి క్రూరంగా, కఠినంగా కనిపిస్తుంది.

అడవిపిల్లులు సాధారణంగా అడవులలోను, విశాలమైన మైదానాలలోను ముఖ్యంగా గడ్డి, చెరకు, జొన్న బాగా పెరిగిన ప్రదేశాలలో సంచరిస్తూంటాయి. పొంచుండి అకస్మాత్తుగా జంతువులమీదపడి వేటాడి చంపి తినడానికి ఇవి వీలుగా ఉంటాయి.

అడవిపిల్లులు అకస్మాత్తుగా మీదపడి కొల్లగొట్టి ఆహారం సంపాదించుకునే జాతి జంతువులకు చేరినవి. కాలిపాదాలక్రింద దళసరిపాటి మెత్తని దిండ్ల సహాయంతో ఇవి నిశ్శబ్దంగా చడీ చప్పుడు లేకుండా సంచరించగలుగుతాయి. జంతువు కనిపించిన వెంటనే ముందుకు

## టోక్యోలో క్రిక్కిరిసిపోయిన సిమెట్రీలు

*జపాన్ టోక్యోలో చావడం అంటే ప్రపంచంలో విపరీతమైన అత్యధిక ఖర్చు. 3 × 4 అడుగుల నేలకు రూ. 4 లక్షలు ఇస్తామన్నా 20 మందిలో ఒకరికే స్థలం దొరుకుతుంది. టోక్యోలో పూడ్చిపెట్టే సిమెట్రీలలో స్థలం తక్కువగా ఉండడం వల్ల అర్జీదారుల అదృష్టం లాటరీతో నిర్ణయింపబడుతుంది.*

'శరీరానికి తిండి ఎంత అవసరమో, ఆత్మకు ప్రార్థన అంత అవసరం.'

పరుగెత్తుతాయి లేక అవి వీటిదగ్గరకు వచ్చి మంచి అవకాశం దొరికేదాకా పొంచి కాచుకుని ఉంటాయి. ఇవి సాధారణంగా చిరుతపులిలాగా సంచరిస్తాయి.

కుక్కలు వాసనతో పసిగట్టి వేటాడితే, పిల్లులు సాధారణంగా దృష్టి మరియు వినికిడి శక్తుల మీద ఆధారపడి ఉంటాయి. పూర్తిగా చిమ్మ చీకటిలో బాగా చూడలేకపోయినా, ఉన్న వెలుగులో బాగా చూడడానికి, కాంతివంతమైన వెలుగునుంచి రక్షణ కలిగించుకునేటట్టు వాటి కళ్లు ఏర్పాటై ఉన్నాయి. చీకటిలో కళ్లను పెద్దవిచేసి రాత్రిపూట ఆహారం వెతుక్కోగల శక్తి వీటికి ఉంది. పగటిపూట వీటి కంటిగ్రుడ్లు సూర్యకాంతి పడకుండా సన్నని చీలికలులాగా ముడుచుకుంటాయి. రెండు ప్రక్కలనుంచి వచ్చే శబ్దాలను ఒకేసారి అడవి పిల్లులు వినగలవు. ఒక చెవిని ముందుకు వంచి ఒకవైపు శబ్దాన్ని మరోవైపునుంచివచ్చే శబ్దాన్ని రెండవ చెవిని వెనుకకు వంచి వింటుంది. మానవుల చెవులకు వినిపించని అతి సున్నితమైన శబ్దాలనుకూడా ఇవి బాగా వినగలవు.

అడవిపిల్లులు సూర్యోదయం మరియు సూర్యాస్తమయ సమయాలలో జంతువులను వేటాడుతాయి. మంచి బల నైపుణ్యంతోపాటు వీటి కాలిగోళ్లు వేటాడడానికి ఆయుధాలులాగ ఉపకరిస్తాయి. ముడిచి తెరవగల వాడియైన గోళ్లలో వేటాడిన జంతువును పట్టి ఉంచి వాడిగా ఉండే పళ్ళతో చీల్చి చిన్న చిన్న ముక్కలుచేసి తింటుంది.

అడవి పిల్లులు కుందేళ్లు, ఎలుకలు, చుంచులు, పక్షులువంటి చిన్న చిన్న జంతువులను వేటాడి తింటాయి. అవలీలగా అతి చెట్లను ఎక్కుతాయి. అప్పుడప్పుడు పక్షులగూళ్లలో ఉండే గ్రుడ్లను దొంగిలించుకు తింటాయి.

జనవరి మొదలు ఏప్రిల్ వరకు మరియు ఆగస్టు మొదలు నవంబరువరకు వీటికి జతకూడే సమయం. సాధారణంగా ఇవి మూడు మొదలు అయిదు పిల్లలను పెడతాయి. అప్పుడే పుట్టిన పిల్లికూనలు 11 మొదలు 15 రోజులలో కళ్లు తెరుస్తాయి.

పంటప్రదేశాలలోను, ఇతరమైదానాలలోను ఇవి ఎలుకలు మొదలైనవాటి బెడదలేకుండా చేస్తాయి. అయినా ఇవి కోళ్లఫారాలమీద పడి దోచుకుంటాయి కాబట్టి మానవుడు వీటిని వేటాడి చంపేస్తూంటాడు.

—'సిఇఇ - ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

# పెద్ద వివాహమహోత్సవం




*ప్రపంచ క్రైస్తవ మత ఏకీకరణకై ఏర్పడిన హోలీ స్పిరిట్ అసోసియేషన్ నాయకుడు సున్ మైయంగ్ మూన్ ప్రపంచంలో మిక్కిలి పెద్ద వివాహ కార్యక్రమాన్ని జరిపించిన మొదటి వ్యక్తి. 1970 అక్టోబరులో దక్షిణ కొరియా రాజధాని సియోల్‌లో ఒకేసారి 791 మంది దంపతులకు సామూహిక వివాహం ఏర్పాటు చేసాడు.*

"స్నేహితుణ్ణి నిలబెట్టుకోవాలన్నా, శత్రువుని జయించాలన్నా మంచిని ఆచరించాలి."

